# ఆట పాటలు

(గేయ సంకలనం)

జె. బాపురెడ్డి

జూబిలీ పబ్లికేషన్స్
హైదరాబాదు

# AATA PAATALU

*(Anthology of Songs)*

by

**Dr. J. Bapu Reddy**



*First Edition :* **2000**

*Price :* **Rs. 100/-**
**US $ 10**

**Jubilee Publications**
Plot 10, Road 5, Jubilee Hills,
Hyderabad 500 033.
Ph. 040-360 8381

*Copies available at :*
**Visalandhra Publishers**
4-1-435, Bank Street, Vignan Bhavan
Hyderabad and **Branches**

**Book Links Corporation**
Narayanguda, Hyderabad - 500 044.

**Navodaya Book House**
Opp. Arya Samaj Mandir
Kachiguda, Hyderabad - 500 027.

*Designed & Printed at:*
**Vipla Computer Services**
*(Designers & Multi Colour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044. Ph. 040-767 3309

*Dedicated to Aerra Rohun, a six year old NRI child prodigy at the 6th ATA Convention, Atlanta (USA).*

# అంకితం



ఎర్రా నరసింహ రెడ్డి - లీల ధన్యదంపతుల పౌత్రుడు

పి. ఆర్. కృష్ణారెడ్డి - శశికళ పుణ్యదంపతుల దౌహిత్రుడు

డా॥ ఎర్రా సురేశ్‌రెడ్డి - లీల యువదంపతుల పుత్రుడు

ప్రతిభాశాలురైన ప్రవాసాంధ్ర బాలబాలికలకు

ప్రతినిధి వంటి ఆరేళ్ల ఆదర్శ విద్యార్థి

చిరంజీవి **ఎర్రా రోహాన్** కు

(ఆరవ అమెరికన్ తెలుగు అసోసియేషన్

అట్లాంటా మహాసభల్లో జూలై 1-3, 2000)

ఆశీస్సులతో ఈ కృతి

**అంకితం**

- జె. బాపురెడ్డి

# ఆదర్శ బాలునికి ఆశీరక్షతలు

రోహన్ రోహన్ నీ పేరు
లోక ప్రియమోయీ !
చిన్న వాడవేకాదు నీవు
చిరంజీవివోయీ !

పుట్టిపుట్టగానే నీకు
పెట్టిన పేరు రోహన్
సూర్యచంద్రుల, నక్షత్రాల
సోదర నామం రోహిణ్
సుందర నామం రోహిణ్

యూయస్సే గర్భంలో లేచిన
ఓజస్సువు నీవు !
తెలుగు రక్తరాగంలో పూచిన
తేజస్సువు నీవు !

జోలులు పాడిన తల్లి కళ్లల్లో
లీలా హేలవు నీవు
సదాశయాల తండ్రి గుండెలో
సురేశ లోకానందం నీవు!
బాలకృష్ణుడవు శశివదనుడవు
నరహరిచిల్లీలా స్పందనుడవు!

తల్లి ఒడిలో శారద గుడిలో
ప్రతిభా పాటవ గుమ్మడు నీవు
ఇంట్లో, మిత్రుల ఇంట్లో, ముద్దుల
మూటలు గట్టే బొమ్మవు నీవు !

పిన్నల పెద్దల మన్ననలందిన
విద్యల బుద్ధుల అంచవు నీవు
భాషలు నేర్చి భావము లెరిగి
భాషణలాడే బాలుడ వీవు !

తెలుగు సాహితి, తెలుగు సంస్కృతి
తెలుగు చరిత్ర, తెలుగు చేతన
భారతీయతకు అద్దం పట్టే
పాటల తోటకు రావయ్యా!
విజ్ఞాన వినోదాలు నిండిన
కవితల పేటిక కొనుమయ్యా!

అట్లాంటాలో ఆటా సభలో
ఆటపాటల సంరంభంలో
అందరి అనురాగాశీస్సులతో.
ఈ కృతి నీకే అంకితమిదుగో
స్వీకృతి తెలుపుము చిరునవ్వులతో
పంచుకొనుము ఈ పాటల పరువం
ప్రవాసాంధ్ర బాలా వనితో.

– జె. బాపురెడ్డి

జులై 1, 2000, అట్లాంటా

# ప్రపంచ విపంచి

పద్యకవిత్వం రాసినవాడు పరబ్రహ్మ
వచన కవితా శ్రీలోలుడు విష్ణుదేవుడు
బాలగేయ విశారదుడు పరమేశ్వరుడు
బాపురెడ్డిగారు త్రిమూర్తుల త్రివిక్రముడు

మనిషి జీవితంలో మూడు సంధ్య లుంటాయి. ఉదయసంధ్య బాల్యంనుండి యౌవనం వరకు, మధ్యాహ్నసంధ్య ప్రౌఢనిర్భర వయః పరిపాకదశ. సాయం సంధ్య తాతయ్యగా మారిన పితామహదశ. మిత్రులు డాక్టర్ బాపురెడ్డిగారు నాకు చిన్నప్పటినుండి తెలుసు. ఉదయ సంధ్యలో పద్యగేయాలు హృద్యంగా పాడారు. పల్లెలు పులకించాయి. మల్లెలు పరిమళించాయి. యౌవనరాగం గుబాళించింది. ప్రణయం ప్రణవనాదం చేసింది. మధ్యాహ్న సంధ్యలో బాపురెడ్డిగారు దేశదేశాలు తిరిగారు. పాటలూ పద్యాలతో పాటు వచన కవితలు హృదయగీతాలుగా పాడారు. ప్రణయంలో నుండి ప్రగతిపథం సాగింది. ప్రపంచమంతా తన కుటుంబంగా విశ్వవీణ మీటింది. ప్రపంచకవుల కావ్యగానాలలో గళం కలిపి యుగళగీతం పాడింది. తెలుగులో తన సొంత గొంతు, ఇంగ్లీషులో తన భావధార, అనువాదంలో తన అస్తిత్వస్ఫూర్తి బాపురెడ్డి కవితామూర్తి ప్రదర్శించింది. బాపురెడ్డి కవితాసంపుటులు ప్రపంచ ప్రకృతి సౌందర్య విలాస వైచిత్తుల. రంగుల రాట్నం, మానవతాసంబంధాల మహనీయ హరివిల్లు.

సమకాలీన తెలుగు కవులందరిలో ప్రపంచాన్ని తెలుగు కవితకు పరిచయం చేసిన ప్రతిభామూర్తి డా॥ బాపురెడ్డి. అలనాడు శ్రీనాధుడు తిరిగిన ప్రాంతాలు, చూచిన మనుషులు, అనుభవించిన రుచులు పచులు ఆయన కవితల్లో చూచాం. ఈనాడు బాపురెడ్డి గారు రచించిన విదేశ స్వదేశ విభావరులన్నీ వారి కవితాదర్పణాలలో ప్రతిబింబిస్తూ ఉన్నాయి. తెలుగు కవులలో ఇంతగా ప్రపంచాన్ని తిరిగి తన అనుభూతులను ఇంతగా తెలుగువారికి పంచిన కవి మరొకరు లేరు. అందుకే బాపురెడ్డిగారు దేశదేశాలు తిరుగుతూ కవితలు రాస్తారు. హైదరాబాదులో దిగి సంపుటీకరిస్తారు. దాన్ని అంతర్జాతీయ సభల్లో ఆవిష్కరిస్తారు. అందుకే మేమందరం అంటుంటాం. 'బాపురెడ్డి! బాపురే! ప్రపంచ విపంచి! అని -

డాక్టర్ బాపురెడ్డిగారు స్నేహమూర్తి, ప్రణయమూర్తి ; అన్యోన్య దాంపత్యం గల అదృష్టవంతులు. ప్రేమించే పిల్లలున్న పుణ్యాత్ముడు, మనసిచ్చే మిత్రులున్న మహితాత్ముడు, వీటన్నింటికీ మించి మందారాల్లాంటి మనమల్నీ మనుమరాళ్ళనూ ఎత్తుకొని మురిసిపోయే ధన్యాత్ముడు.

బాపురెడ్డిగారు తాతగారయ్యారు. దానితోపాటు బాలగేయ పితామహులయ్యారు. పెద్దలందరికీ పద్యాలు పంచి పెట్టిన ఈ పెద్ద మనసున్న దొడ్డమనిషి మనుమళ్లను మనుమరాళ్ళను ఎత్తుకుంటే చాలు మంచిపాటలు పద్యాలు ఆశువుగా రాసి వారికి కానుకలిస్తున్నారు. అక్షరోపాయనాలు అందించే కవితల తాతయ్య బాపురెడ్డి గారు.

బాపురెడ్డిగారు తాతగారయిన తరువాత మనుమళ్ళ నెత్తిన తాతలను చూచినా, కానుకుల నెత్తిన దంపతులను చూచినా ఒక కొత్త మోజు ప్రదర్శిస్తున్నారు. ఆధునిక విశ్వకుటుంబ సంస్కృతికి అభినవవైతాళికుడు డాక్టర్ బాపురెడ్డి.

అందుకే ఆయన నోట కొత్త పరిభాష పుట్టింది. ఆటా (ATA) అంటే అమెరికా తెలుగు అసోసియేషన్ అనే అర్థంతో పాటు తెలుగు కవిత ఆడిపాడే ప్రపంచ క్రీడ అనే అర్థంలో బాపురెడ్డిగారు భావించారు. అందువల్ల - ఆటపాటలంటే కొత్తరకం ఉభయభాషా శ్లేష ఏర్పడింది. ప్రపంచమంతా పరుచుకొని ఉన్న తెలుగుపిల్లలకందించే వెలుగు గీతులు బాపురెడ్డిగారి ఆటపాటలు ఆడుకొనేవి, పాడుకొనేవి, ఆడుతూ పాడుకొనేవి, పాడుతూ ఆడేవి అయిన పాటలివి.

'ఏ దేశమేగినా, ఎందుకాలిడినా' - అన్న రాయప్రోలు వారిలాగా బాపురెడ్డిగారు "భారతీయుడగుటకన్న భాగ్యమేదిరా?'

స్వాతంత్ర్యం కన్న మిన్న స్వర్గమేదిరా?' అని బాలలకు ప్రబోధించారు. బాపురెడ్డిగారి బాలగేయాల సారమంతా ఒక్క మాటలో చెప్పాలంటే -

"జాతి మతముల కన్న, కట్టుబొట్టుల కన్న
నీతి నిజాయితి, శాంతి సమతోన్నతి
మిన్నయని నమ్మిన మేటి సంస్కృతులివి
వసుధ భావిచరిత్ర వ్రాయు భాషలివి"

అట్లాంటాలో 'ఆటా' సభలో చిరంజీవి రోహణ్‌కు అంకితమిచ్చే గేయ సంపుటి ఇది. ఒక పెద్దతరం చిన్నతరానికి అందిస్తున్న ప్రేమకానుక! ఇది ముద్దుల మూటగట్టిన ముచ్చటైన వేడుక! ఆంధ్రుల అంతార్జాతీయ స్పృహకు అక్షరనికేతనం; బాపురెడ్డిగారి బాలసాహిత్యానికి కీర్తి కేతనం!

- ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం
కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు సలహా సంఘ సభ్యులు
హైదరాబాదు

# తెలుగుదనం వెలిగించే ఆటపాటలు

షష్టిపూర్తి చేసుకొన్న నన్ను రెండవబాల్యం ఆవహించింది. సుమారు అయిదు దశాబ్దాలుగా సాహిత్యారాధనంలో, సత్యశోధనంలో జీవితం గడిపాను. నాకు "ఋషిత్వం" వచ్చిందని నన్ను అందరూ అభినందిస్తుంటే "శిశుత్వం" నన్ను ప్రేరేపిస్తున్నది.

*"చితికిపోయిన జీవితంలో*

*బ్రతికిపోయిన బాల్యం కోసం వెతుకుతున్నాను"*

అంటూ బాల్యావేశం నన్ను ఈ "ఆటపాటల" బాటలో నడిపిస్తున్నది. బ్రహ్మత్వాన్ని అన్వేషిస్తున్న నాకు బాల్యత్వమే ఋషిత్వాన్ని ఉపదేశిస్తున్నట్లున్నది. నూతన శతాబ్ది, నూతన సహస్రాబ్ది తొలివసంతంలో నా కవితాత్మలో ఈ "ఆటపాటలు" ఆవిష్కృతం కావడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

బాల బాలికలను, నవయువకులను ముఖ్యంగా ప్రవాసాంధ్ర బాలలను ఉద్దేశించి వ్రాసిన పాటలివి. రాగయుక్తంగా పాడుకోవడానికి వీలైన ఈ గేయాలు, నృత్యాభినయం చేస్తూ ప్రదర్శించడానికి కూడా అనువైనవి. బాలసాహిత్యం అనే పేరుతో కాకపోయినా చిన్నారులకు విజ్ఞానాన్ని వినోదాన్ని అందించే కవితలు, ముఖ్యంగా గేయాలు గేయనాటికలెన్నో నేను అప్పుడప్పుడు వ్రాస్తూనే ఉన్నాను. అయితే, ప్రవాసాంధ్ర బాలబాలికలలో భారతీయ భాషా సంస్కృతుల పట్ల అభిరుచి అవగాహన కలిగించే కవితలు వ్రాయాలనే సంకల్పం నాకు కలిగింది. ఆ సంకల్పసిద్ధికి దోహదం చేసిన సన్నివేశాలెన్నో తటస్థించినాయి.

ఈ మధ్య నేను మెక్సికో, అమెరికా దేశాల్లో సాహిత్య కార్యక్రమాల సందర్భంలో పర్యటించాను. అప్పుడు నా ఆప్తమిత్రుడు శ్రీ పి.ఆర్. కృష్ణారెడ్డిగారు నన్ను గ్రీన్ వీల్ (SC) తీసుకెళ్ళి ఆతిథ్యమిచ్చాడు. అప్పటికే నా మనమల, మనమరాళ్ల సావాసంలో బాలవికాస సాహిత్య రచనపట్ల కవితావేశం పెల్లుబుకుతున్న మానసిక స్థితి నాది. రసజ్ఞుడు, విజ్ఞుడూ అయిన కృష్ణారెడ్డి గారికి తన దౌహిత్రుడు చిరంజీవి రోహణ్ పట్ల పెంపొందిన వాత్సల్యాభిమానం, నన్ను మంత్రముగ్ధున్ని చేసింది. ఆరేళ్ల యర్రా రోహణ్ బాలకృష్ణ లీలలు, ముద్దుమాటలు, తెలివితేటలు ఆయనకెంత ఆనందం కలిగించాయో అంతకంటే పదిరెట్లు కవిగా నాకు కలిగించాయి. నేను ఒక పుస్తకం ఆ చిన్నారికి ఆటా సభల్లో అంకితం చేయాలనే సంకల్పం నా కప్పుడికప్పుడు కలగడం అందుకు శ్రీ పి.ఆర్. కృష్ణారెడ్డి అంగీకరించడం జరిగింది. తాతా-మనుమల మధ్య పరిమళించిన అనిర్వచనీయ అనురాగం, ఈ "ఆటపాటల" రచనకు అమెరికాలోనే అంకురార్పణ జరిపింది. ఇప్పుడు ఈ గ్రంథరూపంలో ఆటా మహాసభల వేదిక మీద ఆవిష్కరింపబడింది. ఆబాలగోపాలం ఆశీస్సులతో రోహణ్ అంకితం తీసుకున్నాడు. అందుకు ఆ బాలుడు ధన్యుడు. ఆయనను కన్న తల్లిదండ్రులు, పితామహ, మాతామహ

దంపతులు అభినందనీయులు. నా చేత ఈ సత్కార్యం చేయించిన పుణ్యదంపతులు శ్రీ పి.ఆర్. కృష్ణారెడ్డి - శ్రీమతి శశికళకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఆటా సభల్లో నన్ను పాల్గొనడానికి ఆహ్వానించిన కార్యనిర్వాహకులందరికీ ముఖ్యంగా ఆటా అధ్యక్షులు డా॥ ఆదిశేషారెడ్డిగారికి, కన్వీనర్ శ్రీ నరేందర్‌రెడ్డిగారికి కార్యక్రమాలు రూపొందించిన శ్రీ శ్యాంసుందర్ యల్లం రాజు, శ్రీ వేణు దసిగి గారలకు నా కృతజ్ఞతాభి వందనాలు. ఆటా సంస్థకు అంకితభావంతో సేవచేస్తున్న ఆదర్శ దంపతులు డా॥ సుధాకర్ జి. రెడ్డి, శ్రీమతి వనిత నన్నెంతో ప్రోత్సహిస్తూ, ఆటా కార్యక్రమాల్లో నాకు భాగస్వామ్యం కల్పిస్తున్నారు. అందుకు వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు. నా అమెరికా యాత్రను ప్రోత్సహించిన ప్రవాసాంధ్ర మిత్రులందరికీ ముఖ్యంగా బాలాజీ-రాధికా దంపతులకు, డా. దేవరాజ్ సుధాకర్, శ్రీ దామోదర్‌రెడ్డి-వినోద దంపతులకు, శ్రీ శంకర్‌రెడ్డి, శ్రీ సత్యం మందపాటి గార్లకు నా ప్రశంసా పూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంథానికి తన ఆత్మీయ "ప్రపంచ విపంచిని" శ్రుతిచేసిన, జగద్విఖ్యాత సాహితీమూర్తి, సాహిత్య విమర్శక పితామహులు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారికి నేను సర్వదా కృతజ్ఞున్ని. బుక్కుల వంటి ఆయన వాక్కులు సత్యసాహిత్య విలువలకే శ్రీరామరక్ష. సోదర భావంతో నా గ్రంథరచనకు, ప్రచురణలకు తోడుపడుతున్న పెద్దలందరికీ ముఖ్యంగా ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి, శ్రీయుతులు కె.ఎస్.రెడ్డి, బి. రామలింగరాజు, అజీజుల్లాఖాన్, పి. సుదర్శన్‌రెడ్డిగారికి, ఎస్. కొండలరావు, ఎ.వి. యస్. రాజు, ఎస్. రాధాస్వామి, జి.ఎస్. ప్రకాశరావు, డా॥ సీతాకాంత్ మహాపాత్ర, ఆచార్య యస్. యస్. ప్రభాకరరావు గార్లకు నా గౌరవాభివందనాలు.

నా సాహిత్య యాత్రలో చేదోడువాదోడుగా ఉన్న అగణిత బంధుమిత్రులందరికీ, ప్రత్యేకంగా శ్రీయుతులు పి. మహేందర్‌రెడ్డి, జె. మారుతి, ఎన్. నాగేశ్వరరావు, జగన్మోహనరావు, వల్లూరి రాఘవరావు, యం. కె. రాము, టి.ఎల్. ప్రసాద్, రవీందర్‌రెడ్డి గారలకు నా ఆత్మీయాభివాదాలు. ఎంతో ఓపికతో నా "సాహిత్య స్వైరవిహారాన్ని" భరిస్తున్న శ్రీమతి రాజేశ్వరికి నా శుభాకాంక్షలు. చిరంజీవులు పి. దేవి, పి. సాయికృష్ణ, జె. యశ్వాంత్, జె. రసిక్ వారి ముద్దు మాటలతో నా "ఆటపాటలకు" స్ఫూర్తి నిస్తున్నారు. అందుకు వారికి నా శుభాశీస్సులు.

ఈ పుస్తకాన్ని ముచ్చటగా ముద్రించిన విప్ల కంప్యూటర్ సర్వీసెస్ వారికి, ముఖచిత్ర రచనకు, తోడ్పడ్డ జవహర్ బాల భవన్ డైరెక్టర్ శ్రీమతి డి. కమలాకుమారి గారికి నా కృతజ్ఞతలు.

- బాపురెడ్డి

# ఇందులో . . .

# బాల హేల

బాలలం - బాలలం
బాలకృష్ణ లీలలం
బాలలం బాలలం
పాలకడలి ఖేలలం

కలలు గనే పూవులం
కళలలోని తావులం
ఆటలలో పాటలలో
ఆదమరచు జీవులం -

కన్నతల్లి దండ్రులకు
కదలాడే బొమ్మలం
భరతమాత పెంచుతున్న
భావి మావి కొమ్మలం -

చదువుకునే దీపాలం
సమత, నవత, రూపాలం
నవ భారత మందిరాన
నవజీవన శిల్పాలం -

దేశభక్తి, త్యాగశక్తి
దీపించిన తారకలం
కులమతాల గొడవలేని
గుణధనులం - రసధునులం -
బాపూజీ, చాచాజీ
భావాలు, ఆశయాలు
ప్రకటించే పాటించే
ప్రగతిరాగ గీతాలం.

# పాట పేరు

పాటా! పాటా! నీపేరు
ఏటో చెప్పమ్మా!
పాటా! పాటా! నీ ఊరు
ఏదో చెప్పమ్మా!

నా పేరేదో నాకే తెలియదు
పల్లవి నడగండి
నా ఊరేదో నేనే ఎరుగను
పాదాలను అడగండి!

పల్లవిగారూ చెబుతారండీ
పాటకు పేరేదో!
చరణాల్లారా! చెబుతారండి
పాటది ఊరేదో!

పాటకు పేరు పెట్టేవారు
పాఠకులే నండీ!
పాటలు ఉండే ఊరంటారా
శ్రోతల ఎదలండీ! -

భాషల తోటల్లో విరబూచే
భావాలేనా పాటలు
వసంతకోకిల రాగాలేనా
గాయక గళాల మీటులు

# ఆటా పిలుపు పాట

రండి రండి! తెలుగు లార!
ఆటా విరితోటకు
మన భాషా సంస్కృతులు
పరిమళించు కోటకు -

యువతీయువకులు కలిసి
పిల్లలు పెద్దలు కలిసి
పరిచయాలు పంచుకొనే అభిమానం పెంచుకొనే
వేదిక యే మన ఆటా ప్రతిభా ప్రగతికి బాట

తెలుగు భారతి విశిష్ట
విలువలు పోషిద్దాం
అమెరికావని నిండా ఆత్మీయత పండిద్దాం
రసానంద కళాస్పంద రసికాత్మలు వెలిగిద్దాం

తెలుగు ఆట తెలుగు పాట
తెలుగుకట్టు తెలుగు బొట్టు
తెలుగు చరిత తెలుగు ఘనత తెలుగు దనం శోభిల్లే
మన ఆటా మహాసభల మహోత్సవాలకు రండి

కులమత వర్ణ వివక్షలు
కలహం కలతలు కక్షలు
మచ్చుకైన లేని స్నేహ మందిరాలు నిర్మిద్దాం
ఆటా అభ్యుదయాశయ మక్షరాల సాధిద్దాం

జె. బాపురెడ్డి

# కన్నతల్లి

కనిపించే దైవమే
కన్నతల్లి
పలికించే వాణే ఆ
పాలవెల్లి -

జీవసృష్టి చేయగల్గు
దేవే మాత
ప్రేమకొరకే ప్రేమించే
ప్రేమే మాత -

కాలానికి దారిచూపు
కరుణే అమ్మ
కలలకు రూపం దిద్దే
కళయే అమ్మా -

నింగిని నేలకు కలిపే
సంగణియే జనని
పాతబడుటయే లేని
పాటే జనని -

శ్రీకారపు ఓంకారపు
ఆకారమె అమ్మ
షట్‌ఋతు సంయోగకాల
చక్రమె అమ్మ

# చైత్రోదయం

వచ్చింది వచ్చింది వాసంతము
తెచ్చింది తెచ్చింది భాస్వంతము -

కొమ్మచాటున దాగి
కోకిలలు పాడాయి
రెమ్మలన్నీ పూలరెక్కలై ఆడాయి
తేటిగుండెల్లోన
తేనియలు నిండాయి
రంగులెన్నో తోట ముంగిళ్ల పండాయి

కొండకోనలు కొత్త
కోకలు ధరించాయి
ప్రకృతిమాతను దీక్షపట్టి సేవించాయి
చైత్రమాసం కాల
చక్రమును తిప్పె
పండితుడు సరికొత్త పంచాంగమును విప్పె

చేదు, తీపి, ఒగరు
చేతులను కలిపినవి
పిల్లలకు పెద్దలకు దీవెనలు పలికినవి
దేశభక్తికి విజయ
విక్రమం నేర్పినవి
ఊరూరా ఉగాది ఉత్సవము జరిపినవి.

# కన్నతల్లి

కనిపించే దైవమే
కన్నతల్లి
పలికించే వాణే ఆ
పాలవెల్లి -

జీవసృష్టి చేయగల్గు
దేవే మాత
ప్రేమకొరకే ప్రేమించే
ప్రేమే మాత -

కాలానికి దారిచూపు
కరుణే అమ్మ
కలలకు రూపం దిద్దే
కళయే అమ్మా -

నింగిని నేలకు కలిపే
సంగణియే జనని
పాతబడుటయే లేని
పాటే జనని -

శ్రీకారపు ఓంకారపు
ఆకారమె అమ్మ
షట్బుతు సంయోగకాల
చక్రమె అమ్మ

# చైత్రోదయం

వచ్చింది వచ్చింది వాసంతము
తెచ్చింది తెచ్చింది భాస్వంతము -

కొమ్మచాటున దాగి
కోకిలలు పాడాయి
రెమ్మలన్నీ పూలరెక్కలై ఆడాయి
తేటిగుండెల్లోన
తేనియలు నిండాయి
రంగులెన్నో తోట ముంగిళ్ల పండాయి

కొండకోనలు కొత్త
కోకలు ధరించాయి
ప్రకృతిమాతను దీక్షపట్టి సేవించాయి
చైత్రమాసం కాల
చక్రమును తిప్పె
పండితుడు సరికొత్త పంచాంగమును విప్పె

చేదు, తీపి, ఒగరు
చేతులను కలిపినవి
పిల్లలకు పెద్దలకు దీవెనలు పలికినవి
దేశభక్తికి విజయ
విక్రమం నేర్పినవి
ఊరూరా ఉగాది ఉత్సవము జరిపినవి.

# బాల భారతం

బాలలారా! ఏలండీ
భారతదేశం
అణువణువున వెలగాలి
మీ దరహాసం -

ద్వేషవిషం పొంగించే పెద్దలకన్న
ప్రేమ రసం కురిపించే పిన్నలె మిన్న.....
నీతి నిజాయితిలేని నేతలకన్నా
నిర్భయులౌ, నిర్మలులౌ
అర్భకులే మిన్నా

మాయలు, మోసాలు లేని మార్గం మీది
స్వార్థం సమరం కోరని సత్యం మీది -
కులమతాల కుళ్లు లేని
కలయిక మీది

అనుభవం లేదు మీకు
ఔనది నిజమే
దోపిడీలు, దుండగాలు
పాపాలు చేయుటలో
అనుభవమే లేదు మీకు
ఔను నిజమే!

ఆనందం పంచుటలో
అనురాగం పెంచుటలో
దేశభక్తి, త్యాగశక్తి
దీప్తులు పండించుటలో
ఆరాటం కల మీరే
అవనిని పాలించండీ!

# చదువుకో

చదువుకో, చదువుకో !
సంకటాలు తీర్చుకో !
కళ్లున్నా చూడలేని
వాస్తవాలు తెలుసుకో !

చదువుంటే కండబలం
చదువుంటే గుండెబలం
చదువుంటే బుద్ధిబలం
చదువుంటే చీకట్లను
ఎదిరించే మహాబలం

చదువు టెక్కడో కాదు
ఇక్కడే మొదలు పెట్టు
అప్పు డెప్పుడో కాదు
ఇప్పుడే కలం పట్టు
అక్షరాల సాక్షిగా
అజ్ఞానం మట్టుపెట్టు

ప్రశ్న వేయగల్గుటకు
ప్రత్యుత్తర మిచ్చుటకు
మంచిని గెలిపించుటకు
మాయల ఓడించుటకు
శక్తియుక్తు లిచ్చేది
చదువే, చదువే, చదువే !
దురాచారముల మాన్పే
దుర్గం మార్గం చదువే!

# తెలుగు భారతి

తేటగీతమైపోయె
థేమ్సు నది
ఆటవెలది అయిపోయె
ఆంస్టర్ డాము -

రోములోన తెలుగువాణి
రోమాంచము కలిగించె
మారీషస్‌లో తెలుగు
మాట తెనె లొలికించె -

తెలుగు ప్రతిభ టెహరానుకు
వెలుగు హస్తమందించె
తెలుగుల గని అమెరికాయె
నిలువెల్లా పులకించె -

మలయాలో తెలుగు తల్లి
మల్లెపూలు ముడుచుకుంది
మాస్కోలో తెలుగు కవిత
మైత్రి భాష నేర్చుకుంది -

తూర్పు పడమరలు తలుపులు
తెరచి స్వాగతము పలికెను
భారతాత్మ వెలుగు, తెలుగు
భారతికి కళావతికి -

# విజ్ఞాన యాత్రికులు

బయలు దేరారదే
బాల బాలికలు
భారతదేశము చూడ
భావి ఏలికలు -

వింతగా ఎంతయో
వెదకేటి కళ్లలో
విజ్ఞాన దీపాలు
విరబూయుచుండగా
బయలుదేరా రదే బాలబాలికలు . . . .

చిన్నారి భంగిమల
చెన్నారు చేతులు
చిత్రచిత్రాలెన్నో
చిత్రించుచుండగా
యువగీతములు పాడు
నవశక్తి పాదాలు
దూరతీరాల దరి చేరబోతుండగా
బయలుదేరారదే బాలబాలికలు . . .

డెందాల కందాలు
విందు చేస్తుండగా
ప్రకృతి గని ప్రగతి గని
పరవశములో తేలి
జిజ్ఞాస నడిపించు విజ్ఞాన యాత్రికులు
బయలు దేరారదే బాలబాలికలు . . .

# అక్కయ్య - అన్నయ్య

అక్కయ్య అన్నయ్య ఎక్కడ ఉన్నా
బాలానందం వారికి అన్నిట మిన్నా -

బాలబాలికలు వారికి భాషలు భావాలు
బాలబాలికలె వారికి పూలు, పరిమళాలు
బాలబాలికలె వారికి కలలు, వాస్తవాలు -

నీతికథలు, జాతికథలు, నిండుగుండెతో చెప్పి
చెప్పి చెప్పి కథలెన్నో చిన్నారులందరికీ
వారి బ్రతుకే అయిపోయెను వాస్తవ ఆదర్శకథ -

నడకనేర్చు పసికందుకు నర్తన నేర్పి
పలుకనేర్చు పాపాయికి పాటలు నేర్పి
మురిసిపోవు అక్కయ్య మోముకు జేజేలు
మెరిసిపోవు అన్నయ్య మనసుకు జేజేలు -

పిల్లల నాటకములతో పెద్దలకే బుద్ధి నేర్పి
బాలకళాకారులతో భారతికే గద్దె వేసి
కామేశ్వరి అక్కయ్య రాఘవ రావన్నయ్య
అపరసాంబశివులైరి ఆనందభావులైరి -

సంఘం బాలానందం ధర్మం బాలానందం
బుద్ధం బాలానందం శరణం బాలానందం
అక్కయ్యకు అన్నయ్యకు డెందం బాలానందం
ఆంధ్రభాలానంద సంఘమె పూర్ణానందం
జై జై బాలానందం జై విజ్ఞానమరందం -

# భారతీయ విద్యాభవనం

భారతీయ విద్యాభవనం
బాలబాలికల పూలవనం -

ఇక్కడి చక్కటి వాతావరణం
శివసుందరము జగన్మోహనం
సిరిచిరునవ్వులు కళకళలాడే
చిరంజీవుల శక్తి తోరణం -

కులమతవర్గ విభేదం లేదు
కలహాలకు తా వసలే లేదు
నవయువతా స్వప్నాల కోటలో
భవిష్యత్తుకు భయమే లేదు -

ఆటపాటల తోట ఇది
అనురాగాల మూట ఇది
జ్ఞాన చంద్రునివాసమిది
రాగరామా విలాసమిది
సమైక్య భారతి రూపమిది
చదువుల తల్లికి దీపమిది -

బాలకృష్ణులు యశోరాములు
దివ్యప్రతిభాదేవి కుమారులు
స్నిగ్ధ హృదయులు, ప్రియభాషణులు
వర్ధిల్లే విజ్ఞాన లయమిది
రంజిల్లే నవరత్నఖని ఇది -

# తెలుగు వెలుగు మాల!

తెలుగంటే చెలిమిపలుకు
తెలుగంటే తేనె లొలుకు
తెలుగు వెలుగు దూర దూర
తీరాలను మేలుకొలుపు!

నన్నయ్య చేతిలో వెన్న ముద్దలు
తిక్కన పోషణలో చిక్కని పాలు
శ్రీనాథుని ఇంటిలో శీధురసాలు
పోతన భావాలయాన పరమాన్నాలు
ఆరగించె తెలుగు పలుకు పంచాక్షరియై
వెదజల్లెను తెలుగు వెలుగు నవశారదయై! ....

గోదావరి కృష్ణ ఎదల ఆడుతున్నది
భరతమాతృ భావనలో పాడుతున్నది
విద్యాబుద్ధులు కళలు నేర్చుకున్నది
తెలుగు చేవ తన విలువ పెంచుకున్నది
విజ్ఞాన ప్రపంచంలో వెలుగుతున్నది! ....

తెలుగు పలుకులందు జుంటితేనె ఉందిరా
తెలుగు సాహితికి సృజన శక్తి ఉందిరా
తెలుగు సంస్కృతికి కళానురక్తి ఉందిరా
తెలుగు గుండెలో దేశభక్తి ఉందిరా! ....

చైతన్యం తెలుగు జాతి చిరవిలాసము
మమకారం తెలుగునాడి మందహాసము
ప్రతిభయే తెలుగుదనపు ప్రబలశ్వాసము
అభ్యుదయం తెలుగు చరిత అవాసము!

అమెరికా నుండి అటు
ఆస్ట్రేలియా దాకా
ఆసియా నుండి ఇటు
ఐరోపా దాకా
అటు ఇటు అననేమి దక్షిణాఫ్రికా వరకు
దేశ దేశాల తెలుగు దీపం వెలిగేను
భారతీయతను తెలుగు తేజం చిలికేను!

మలేషియాలో తెలుగు
మహాసభలు జరుపుకుంది
మారీషస్‌లో ఆంధ్ర
మాతకీర్తి నిలుపుకుంది!

తానా ఒక తెలుగు కోట
ఆటా ఒక తెలుగు తోట
ఈటా ఒక తెలుగు పాట
తెలుగు ఆట తెలుగు పాట
తెలుగు దనం తెలుగు జనం
భారతీయతకు పూవులబాటరా
విశ్వంభర పులకించే ఆటరా
విస్మరించరానిది "ఈ మాట" రా!

*(1998లో సిడ్నీ (ఆస్ట్రేలియా)లో జరిగిన "తెలుగు పలుకు"*
*ఉత్సవాలు పలికించిన కవిత)*

# మేలు కొలుపు

బల బల బల బల తెలవారింది
బాలలార ఇక లేవండీ!
కిల కిల కిల కిల పక్షులు పాడెను
కిటికీ తలుపులు తెరవండీ!

కొక్కొరో కోయని కూతలు పెట్టి
కోళ్లు జనాలను లేపినవి
చిందులు వేస్తూ కమ్మతెమ్మెరలు
చెట్లను ఊపుచు లేపినవి -

అదుగో తూరుపు గదిలో మేల్కొని
ఆదిత్యుడు వస్తున్నాడు
ఇదుగో చీకటి తోక ముడుచుకొని
చెదరి పారిపోతున్నాది -

నిద్దురలేచి, స్నానం చేసి
ముద్దుగ బడికి వెళ్లండి
గురువులపట్ల గౌరవముంచి
శ్రద్ధగా చదువులు చదవండీ !

పాఠం చదువుట వ్రాయుట కన్నా
ప్రశ్నలు అడుగుట ముఖ్యం !
ఆరోగ్యానికి ఆనందానికి
ఆటపాటలూ అతి ముఖ్యం
ఎన్నటికైనా క్రమశిక్షణయే
అన్నిటికన్నా ముఖ్యం.

# మేలు కొలుపు

బల బల బల బల తెలవారింది
బాలలార ఇక లేవండీ!
కిల కిల కిల కిల పక్షులు పాడెను
కిటికీ తలుపులు తెరవండీ!

కొక్కొరో కోయని కూతలు పెట్టి
కోళ్లు జనాలను లేపినవి
చిందులు వేస్తూ కమ్మతెమ్మెరలు
చెట్లను ఊపుచు లేపినవి -

అదుగో తూరుపు గదిలో మేల్కొని
ఆదిత్యుడు వస్తున్నాడు
ఇదుగో చీకటి తోక ముడుచుకొని
చెదరి పారిపోతున్నాది -

నిద్దురలేచి, స్నానం చేసి
ముద్దుగ బడికి వెళ్లండి
గురువులపట్ల గౌరవముంచి
శ్రద్ధగా చదువులు చదవండీ !

పాఠం చదవుట వ్రాయుట కన్నా
ప్రశ్నలు అడుగుట ముఖ్యం !
ఆరోగ్యానికి ఆనందానికి
ఆటపాటలూ అతి ముఖ్యం
ఎన్నటికైనా క్రమశిక్షణయే
అన్నిటికన్నా ముఖ్యం.

# పవిత్ర భారతి

భారతీయుడవుట కన్న
భాగ్యమేదిరా!
స్వాతంత్ర్యం కన్న మిన్న
స్వర్గమేదిరా!

ఈశుడు వెలసిన హిమగిరి
ఎవరికున్నది?
మనిషే దేవుడని నమ్మే
మనకు ఉన్నది -

ఆరిపోని గంగాఝరి
పారునెక్కడ?
నింగినేల సంగమించు
నెలవు ఇక్కడ -

వేల ఏండ్ల చరిత్ర, ఏ
నేల కున్నది?
కాలాంబుధి తరచిన
వేదాలకున్నది -

సకలలోక శాంతి కోరు
జాతి ఎవరిది?
సహనమె సంస్కృతియైన
సద్గుణులది మనది -

# దేశమే దేవాలయం

దేశమే దేవాలయం
విద్యయే దైవం
దేశ విద్యల పూజలోన
దీపికలు మేము -

తల్లిదండ్రుల గురువ రేణ్యుల
చల్లచల్లని దీవెనలతో
శ్రద్ధగా చదువుకుంటాము
బుద్ధిగా మసలుకుంటాము

పెక్కు పేరులు పెట్టుకున్నా
పెక్కుదారులు వేసికొన్నా
ఒక్కడే భగవంతుడు
ఒక్కటై మేమంత అతనికి - మొక్కుతుంటాము

మతములన్నీ భాషలన్నీ
మనిషికీ దేవునికి మధ్య
మాసిపోని వంతెనలుగా పరిగణిస్తాము
నిత్యజీవన సత్యగీతం పాడుకుంటాము

మట్టిలోన మనిషిలోన - చెట్టులోన పుట్టలోన
చెంతనున్న నీడలోన - అంతులేని నింగిలోన
దాగియున్న సత్యమును కను
యోగదృష్టిని పెంచుకుంటాము

# తాతా - మనుమడు

తాతయ్య కౌగిట్లో
మనుమడు జలపాతం
ముద్దిడు మనుమని మదిలో
తాతేమో మధుగీతం -

గత కాలపు ఘనీభవ
స్మృతులు తాతజీవితం
భావిని గొంతెత్తి పిలుచు
వాహిని పౌత్రుని పథం -

షష్టిపూర్తి చేసుకున్న
చిరంజీవి తాతయ్య
వంశకీర్తి వ్యాప్తిచేయు
వర్ధిష్ణువు మనుమడు -

అనుభవ మాతామహుడు
అడిగే ప్రశ్నలకు
ఆవేశరసోత్తరాలు
అందించును దౌహిత్రుడు -

తాత - మనుమల మధ్య
పాత - క్రొత్తల మధ్య
సాగే సంభాషణలు
సరసభావ ఖేలనలు
నవ కవితా దీపాలు
శివసుందర రూపాలు -

# శిశువు శక్తి

శిశువు ఏడుస్తుంది కాని
చెప్పలేదు ఎందుకో!
తెలియజెప్పే భాష, మనము
తెలిసికోలేనందుకో!

కళ్లు మూసి, కేకలేసి
బోసినవ్వులు దులిపివేసి
కొంపలన్నీ మునిగినట్లు
ఏకాఏకిని ఏడ్పునౌరా!
ఎవ్వరాపగజాలనట్లు -

కొట్టలేము తిట్టలేము
పట్టుకొని భయపెట్టలేము
మర్మరాగం తీయు ఆ పసి
ఋషిని తప్పుపట్టలేము -

వెండి బంగారాలు అయినా
వజ్రవైడూర్యాలు అయినా
కోటి సంపదలైన, పట్టి
కోరికలను తీర్చలేవు -

పలుకు పలుకలేదు గాని
"పలుకుబడి" కి కొదవలేదు
ముద్దులొలుకే మొగ్గముందు
మోకరిల్లే నిస్పృహోయుడ
పాపమెరుగని పాపముందు
పరవశించే పరిమళాన్ని.

# మంకాల ఆట

మనిషీ నీ జీవితం
'మంకాలా' ఆట
గెలుపెపుడో ఓటమెపుడో
తెలియరాని వేట -

ఉన్నచోట ఉండలేని
వ్యూహం మన బ్రతుకు
ఎటుపోతే ఏమౌనో
ఎరుగలేని కిటుకు ! -

మరుపు వలన కొంత
వెరపు వలన కొంత
సందేహం వలన కొంత
సాగలేదు ఈ బ్రతుకు -

అందినట్లే అంది, చేత
కందని ఊరింపు
అందినా తృప్తిలేని
ఆశల వేధింపు -

ఊహల్ని పట్టుకొని
ఉరుకులాడు ఖేల
కడకేమీ మిగలని
క్రయవిక్రయశాల -

# రైలు పాట

ఈల పాట పాడె, రైలు
జోలపాట పాడె, రైలు
పల్లె పల్లెను పలకరిస్తూ
ఢిల్లీ చేరింది, కొత్త ఢిల్లీ చేరింది -

ఆగినట్టే ఆగి ఆగి
సాగినట్టే సాగి సాగి
ఊళ్లు దాటింది రైలు ఏళ్ళు దాటింది -

వానచూచి చెదరలేదు
ఎండచూచి బెదరలేదు
చలిని చూచి వణకలేదు
యోగిలాగ, త్యాగిలాగ వెలిగిపోయింది
రైలు, వెడలిపోయింది -

కొండ గుండెలు తొలచుకుంటూ
కోన గుండెలు మలచుకుంటూ
పగలు కాస్త సిగ్గు మీటి
రేయిలో ఒక కన్ను గీటి
భోగిలా రసయోగిలాగ పొంగిపోయింది
రైలు, తరలిపోయింది -

ఆకసాన మబ్బుకన్న
ఆంగలేసె గాలికన్నా
చెట్టు చేమల పిట్టకన్నా
జోరుజోరుగా దౌడు తీసింది
రైలు, పరుగు పందెంలోన గెలిచింది.

# వెన్నదొంగ

వెన్న దొంగ నీవే
కన్న దొంగ నీవే
వెన్న దొంగ, కన్న దొంగ
కన్నదొంగ నీవే !

ఉట్టి దొంగ నీవే
కనుకట్టు దొంగ నీవే
గుండెల్లో దాగి ఉన్న
గుట్టు దొంగ నీవే -

చిరునవ్వులు చిందుతునే
చిలిపి పనులు చేస్తావు
ఆటపేరు చెప్పిదొంగ
నాటకాలు ఆడుతావు
ఏ 'ట్రిక్కు' సాగకుంటె
ఏడిచి సాధిస్తావు -

దేశీయుడ వీవే, పరదేశీయుడ వీవే
దేశ కాలముల లీలావేశభాషనీవె
పుట్టగానే పరిమళించినట్టి పూవు నీవె -

బాలయోగి నీవె, గోపాల భోగి నీవె
ప్రేమ కడలిలోన వటపత్ర శాయి నీవే
శుభగాత్ర శోభ నీవే !

# ముగ్గురమ్మలు

కన్నదేమో శారద
నను, పెంచుకున్న దేమో శైలజ
శ్రీ లక్ష్మినన్నిపుడు చేరదీస్తున్నది
నా బ్రతుకు సంపూర్ణ నాదమౌతున్నది

ముగ్గురమ్మలు తమ
ముద్దుబిడ్డగ నన్ను
కలిసి మురిపింతురో
కలహించుకొందురో !

ఓ తల్లి మోములో
ఓ తల్లి కనుపించు
ఏ తల్లయినా నాకు
నా తల్లెయనిపించు -

ఒక అమ్మ పెట్టినది
ఒక అమ్మకిచ్చుచు
ఆడుకొనుచుంటి
సత్యాకాశ సరసిలో -

చదువు చెప్పిన తల్లి
శక్తి ఇచ్చిన తల్లి
ఆనంద లక్ష్మికే
అప్పగింతురో నన్ను -

# శాంతి గీతం

శాంతియే ఇంటింటి దీపం
శాంతియే మన కలల రూపం -

బలవంతులెవరైన
బలహీనులను బట్టి
బాధించనప్పుడే బ్రతుకురా శాంతి
వేధించనప్పుడే వెలుగురా శాంతి -

కలిమిగల వారలు
కష్టజీవులపట్ల
ప్రేమ చూపిననాడె పెంపొందుశాంతి
కరుణ చూపిననాడే తరియించు శాంతి -

స్వార్థాలు వీడితే
సమరాలు లేవు
సమరాలు లేనట్టి స్వర్గమే శాంతి
సహజీవనం కోరు శక్తియే శాంతి -

దోపిడీలు లేని
దొరతనాలు లేని
సమతా మమతల సౌధమే శాంతి
శాంతి విజయపరంపరే విశ్వశాంతి -

# రోహిణీ వృత్తం

"రోహిణి" నక్షత్ర మౌట
రోహిణీ పతి చంద్రుడు
"రోహితము" అరుణాశ్వమౌట
"రోహిత్తు" సూర్యుడు -

మొలచునది పెరుగునది "రోహి"
ఎర్రనౌ గోవేమో "రోహిణీ"
'రోహిణీకమణము' వృషభము
తెలుసుకో సంస్కృతము వలనే
తెలుగు పలుకులు తీయన-

"రోహణము" పర్వత విశేషము
రోహమో పైకెక్కుట
"ఎక్కునది" అనుటయూ
"ఆరోహకము" అని అనుటయే

మావటీడని యన్నను, ఆ
రోహకుడు అని అనుటయే -
తెలుసుకో శబ్దాలు ఎట్లు
తీరు తీరున మారునో!

ఎక్కువాడో రోహకుడు; పై
కెక్కుటే 'ఆరోహణం'
లేని దానిని మోపు నదియే
లోకమున 'ఆరోహకం'

# పిట్టలు - పుట్టలు

చెట్టు మీద
రెండు పిట్టలున్నాయి
చెట్టు కింద
పాము పుట్టలున్నాయి -

పిట్ట గుండెలు పెట్టె
ప్రేమతో గుసగుసలు
పాము పడగలు కొట్టె
పగబట్టి బుసబుసలు -

గుసగుసలు పూవుల
గుత్తులై పోయే
బుసబుసలు చీకటి
బుట్టలైపోయె -

విరులేమొ, మమతల
సిరులు పండించె
ఇరులేమొ ద్వేషాల
ఝురులు పారించె -

పక్కనే పారేటి
పంట కాలువలో
పూలతావులు
పొంగి పారలిపోతాయో !
కాల నాగుల విషం
కలిసి పోతుందో -

# సమైక్య రాగం

ఒక్కటేరా తెలుగుదేశం
ఒక్కటేరా తెలుగు భాష
ఎక్కడున్నా తెలుగులందరు
ఒక్కటేరా! ఒక్కటేరా!

ఒక్కటే గోదావరీ నది
ఒక్కటే కృష్ణానది
రెడు నదులు తెలుగుజాతి
గుండెలో ఒక్కటైనవి -

అరుకులోయల గాలికొండ
హైదరాబాదు గోలకొండ
కలిసి కట్టెను తెలుగుతల్లి
కంఠసీమను పూలదండ . . . .

సాగరం ఒకవైపున, నిజాం
సాగరం ఒక వైపున
తెలుగు తల్లికి వీచు చల్లని
అలల వీవెన లంద మొప్పుగా . . .

ఎదలు ఎదలు కూర్చి కట్టిన
ఏకతా సేతువులు మీద
కదలి వచ్చెను ప్రగతి చక్రాల్
కనుల పండువగా . . .

# తోట - పాట

గాలి, వీధుల నడుగుతూంది
గాన భిక్షం
బెండువోయిన గండుకోయిల
ప్రాణవృక్షం -

తోటనేర్చిన మాతృభాష
పాటయేనా।
పాటనేర్పే మేటి తల్లి
పక్షియేనా
పక్షిలేని, పాటలేని తోటలో
గాలి శవమై తేలుతూంది
కాలరఝురి కన్నీటిలో -

పక్షులన్నీ ఎగిసిపోయెను
పాటలన్నీ మూగవోయెను
పాటలేమో పక్షికోసం
ఎదిరిచూచు
పక్షులేమొ పాటలేవని
బెదరిచూచు -

పక్షులను పాటలను కలిపే
తోట నుండి
దిక్కుతోచక తరువులన్నీ
బిక్కు బిక్కున వెడలిపోయెను
ఒక్కటొకటిగా -

# కూలివాడు కుబేరుడు

కూలివాడు మేడ
కట్టుకునే రోజు రావాలి!
బక్కరైతు బెన్జుకారు
ఎక్కురోజు రావాలి -

రైలు గాని బస్సు గాని
రాచ విమానాలుగాని
ప్రకటించిన వేళలకు
రావాలి - పోవాలి -

ఒకటికొకటి పొంతనగా
త్రికరణాలు మెలగాలి
బేలు - జేలు గొడవలేని
రాజనీతి వెలగాలి -

శ్రమశక్తికి - ధీశక్తికి
సమఫలితం అందాలి
చీకటి చెర నుండి, వెలుగు
చిర విముక్తి పొందాలి -

నిజమయ్యే కలలు కనగ
కనులు నిద్రపోవాలి
మాయమత్తులో చిక్కిన
మనసు మేలు కోవాలి -

# తాగాలి తాగాలి పాలు

తాగాలి తాగాలి పాలు
వేసుకోవద్బోయి వేలు
నోట
వేసుకోవద్దోయి వేలు -

పాలు తాగితే మేలు
పస్తుంటే కష్టాలు
రసికుడనుపించుకోవోయి
రాగాల ముద్దు పాపాయి -

రసితము ద్రాక్షరసమోయి
రసోత్తమము అంటె పాలోయి
పళ్ల రసములు పాలు తాగి
పరుపులో పవళించవోయి
రసికుడనిపించుకోవోయి -

రసికమంటే మధురమోయి
రసికమంటే అందమోయి
రసికతంటే రసజ్ఞతయౌ
రసికేశ్వరుడు కృష్ణుడోయి
రసికుడనిపించుకోవోయి -

రసికుడవు నీ వేనటోయి
సుగుణ రాశివి నీవే నటోయి
కడుపు నిండా తినాలోయి
కమ్మని కలలు కనవోయి -

# ఏకానేకం

శుకమవు నీవే - పికమవు నీవే
చిగురు మామిడి చెట్టువు నీవే !

పాటవు నీవే - పాడెదు నీవే
శ్రద్ధగా వినే శ్రోతవు నీవే!

నగమవు నీవే - నదియును నీవే
మలుపులు తిరిగే మార్గం నీవే!

జలదము నీవే - జలధివి నీవే
చలనము లేని పులినము నీవే !

దారివి నీవే - తేరువు నీవే
చక్రము త్రిప్పే సారధి నీవే !

గమనం నీవే - గమ్యం నీవే
ఓడిన, గెలిచిన శక్తివి నీవే !

భాషవు నీవే - భావం నీవే
మాటలకందని మౌనం నీవే!

చిత్రకారుడవు - చిత్రం నీవే
కోరిక తీరని కుంచెవు నీవే !

ఊహము నీవే - వాస్తవ మీవే
వెలుగు చీకటలు వేషం నీవే -

# చిరంజీవులు

కడలి అలల కలల
పుట్టిపెరిగినాము
లలిత కళా సౌరభాలు
మోసి తెచ్చినాము
తీరవాసులం, దూర తీర వాసులం -

నేలబాస గాలిబాస తెలుసు మాకు
నేడు కానరాని
వెలుగుజాడ తెలుసు మాకు
తెనె పాటలం, ప్రగతి చేరుబాటలం -

దండి నదులకన్న ప్రియము
కొండ వాగులే మాకు
తమ్మి పూలకన్న ప్రియం రెల్లు పూవులే
పేద గుండెలం, విమల ప్రేమజీవులం -

అందము - ఆనందము
కనులండి మాకు
ఊహకందని నేస్తమే డెందము మాకు
కాంతి రేఖలం, విశ్వశాంతి వాకలం -

ఓటమన్నదెపుడు మాకు
ఉండబోదు
మేము, ఓడునాడు భావియన్నచుండబోదు
సిరుల కొండలం మేము
చిరంజీవులం . . . .



జె. బాపురెడ్డి

# కోరేవి - తీరేవి

రాసుకున్న పాటలన్ని
వాసికెక్కవు
నాటుకున్న మొక్కలన్ని
రాశికెక్కవు -

కాలమెంత ఉన్నా
మను కాలము కొంతే
దేశమెంత ఉన్నా
మన వాసము కొంతే !

చదువుకున్న దెంతైనా
సంస్కారం కొంతే
తెలసిన దెంతున్నా
మరుపురానిది కొంతే -

కోరే కోరికలెన్నో
తీరేవి కొన్నే
ప్రయత్నాలు ఎన్నెన్నో
ఫలించేవి కొన్నే -

పోటీపడునవి ఎన్నో
గెలిచేవి కొన్నే
లక్షలు లక్షలు మాటలు
అక్షరాలు కొన్నే ! -

# పరహితం

పాడేవారెవరైనా
పాటు తీపి అందరిదీ
భావించే దెవరైనా - భావాదీప్తి అందరిదీ -

పూలతీవ ఎవదిదైన
పూలసొగసు అందరిదీ
కళాకారులెవరైనా - కళానంద మందరిదీ -

ఏ దేశం - ఎవరిదైనా
భూగోళం అందరిదీ
సృష్టికర్త ఎవరైనా - సూర్యచంద్రులందరివీ -

ప్రేమించినదెల్లా మన
పెను సంపదయేను
మలిన మనస్కులకు - లోకమంత శూన్యమేను -

స్వార్థ పరత్వం తల్లి
సంకుచితత్వం తండ్రి
కలిసికనే దేదైనా - కాలాంతక మేను -

ప్రతి ఒక్కరు పరహితమే
పరమార్థం అనుకుంటే
లోకంలో ఎవరికి ఏ - లోటుండదు నిజంగా.

# కుల నిర్మూలనం

లేదురా, లేదురా, లేదురా
కులానికి అర్థం లేదురా!
లేదురా లేదురా లేదురా
మనిషికి మనిషికి తేడా లేదురా!

పుట్టిన తీరందరిదీ ఒకటేరా
గిట్టిన వారందరి దారొకటేరా!
చాతుర్వర్ణాలు, కులాలు
స్వార్థపరులు కల్పించినవేరా!

భారత సమాజం ముక్కలు చేశారు
పాల కడలిలో విషం పోశారు
లెక్కలేని కులాల వలవేశారు
దిక్కులేని పక్షులుగా చేశారు -

మనజాతి చేవను చంపిందిరా కులం
మన చరితను మలినం చేసిందిరా కులం
మన సమాజ దురాచార కారణం కులం
తరతరాల దరిద్రాల కారణం కులం -

ప్రేమకు ఆదర్శం కులం కాదురా
మైత్రికి ఆధారం మతం కాదురా
కులాతీత మతాతీత వివాహాల పునాదిపై
భావిభారత సమైక్య భవనం నిర్మించరా!

# గ్రంథాలయం

గ్రంథాలయమంటే
భావగంధాలయం
అక్షరాల వెలిగే
ఆనందాలయం -

ఆలోచించే వారికి
అమృతం గ్రంథాలు
ఏనాటికి వీడిపోని
హితులే గ్రంథాలు -

రాతి యుగం నుంచి మనల
రాకెట్టు యుగానికి
కాకిలెక్కస్థాయి నుండి
కంప్యూటర్ స్థాయికి
చేర్చినట్టి శతాంగాలు
చేతన గల పుస్తకాలు -

బుద్ధిబలం పెంచేవి
హృదయం కరిగించేవి
భాషలన్నిటికి జీవం
పోసేవి గ్రంథాలే -

పుస్తక పఠనం మాని
అంధులు కావద్దండి
శ్రుత పాండిత్యం తోనె
సంతృప్తి పడొద్దండి
గ్రంథాలయములు తరచి
అమృతాంధసులై పొండి.

# కాలేశ్వరి కంప్యూటర్

కాలాన్ని పాలించు
కంప్యూటరీ!
మనసిచ్చి బాలకుల
మాట వినుమా!

నిన్ను చూస్తే మాకు
నిలువెల్ల పులకింత
నీ శక్తి యుక్తులు, నిఖిలావనికి వింత

చిటికలో కొండంత, చిక్కు విడదీస్తావు
కోటి లెక్కలను, కొన గోటితో చేస్తావు
లెక్కలేని పనులు ఒక్కతివే చేస్తావు

ఏ ప్రశ్న అడిగినా
ఇట్టే చెప్పేస్తావు
సృష్టంత క్షణంలో
చుట్టేసి వస్తావు

దుష్టదుర్మార్గాల, దోపిడీ వ్యూహాల
మారణ సూత్రాల, మాట వినబోకు
చెరుపు చేసే పనికి చేయూత నీకు

దేవలోకాలకు దీటుగా ఈ భువిని
తీర్చి దిద్దుట కొరకు దీక్ష గైకోవాలి
సత్యసౌభాగ్య రథ సారథివి కావాలి.

# కలల లోకం

కలతలు నిండిన జీవితాలకు కలలే ఆశల దివ్వెలు
నీరవ జీవిత నిశీథిలోన కలలే కదలే మువ్వలు -

స్వప్నం నుండే పుట్టును మనిషి
స్వప్నం చుట్టే తిరుగును మనిషి
స్వప్నంలోనే పెరుగును మనిషి
స్వప్న లోకములు చేరును మనిషి -

ఏ మహనీయుని కలయో ఈ ఇల
ఏ నిర్నిద్రుని సృష్టియో కల
స్వప్నా లేను సత్యాలౌచు సత్యాలేను స్వప్నాలౌచు
చరాచరాలను, చిరాచిరాలను
చెప్పరాని చీకటిలో ముంచును -

గతం కన్న కలయేనో, నేడు
వర్తమానపు కనుగొనలందు
భవిష్యత్తు, కలయై కదలాడు

రేయిఒడిని ఏ తీయని కలల
తేలియాడెనో పూల మొక్కలు
ఉదయసంధ్యలో మధురసభావం
విరబూచే చిరు నవ్వులు చిందును!

కలలో కోడి రాగల వెలుగును
కాంచి లోకమును మేలు కొలుపును
పేద కార్మికుని నిదుర కనులలో
పెను సంపదల వసంతం విరియును
కలలు కనే ఆ కన్నుల నుండి
వెలుగు చిమ్ము మధుకణములు కురియును -

# దిక్కులేని భూగోళం

చుక్కలనే కళ్లతో
చూస్తున్నది కాలం
శూన్యమనే కడలిని
శోధిస్తున్నది కాలం -

క్షణమైనా ఆగకుండ
సాగిపోతున్నది
ఏ గమ్యం లేకుండా
ఎగసిపోతున్నది -

దిక్కులేని భూగోళం
బిక్కు బిక్కుమంటూంది
వెలుగు చీకటుల వలలో
విలవిలలాడుతూంది -

గతము, భావి, ఆది, తుది
స్థితి లయములు లేవు
అనంతమను భావనకే
అర్థమ్ము లేదు -

దేశకాలములు తమకే
తెలియక తడబడుతుంటే
ఎంతో తెలిసినట్టు
గంతులు వేయును నరుడు -

# సహజ సంబంధాలు

పక్షికి స్వేచ్ఛ ఆకాశం
పాటకు కళ్లెం పల్లవి -

దూసుక వచ్చే వాన చినుకులకు
ధూళినేల యే గమ్యం
చిందులు వేసే కడలి అలలకు
చెలియలికట్టే గమ్యం

నేలకు రాలిన పండుటాకులకు
గాలి తరగలే రెక్కలు
తళతళలాడే పూలరంగులకు
దాగిన తావులే విలువలు

పరుగులు తీసే రైలు బండికి
కదలని పట్టాలే ప్రాణం
నింగిని తేలే విమానాలకు
నేలమీదనే ధ్యానం -

ఆటల ఆడే పాపాయిలకు
నీటి బుడగలే ఆనందం
పాటలు పాడే కోకిలమ్మలకు
మావిచిగురులే ఆవేశం -

కరిగిపోయేడి కొవ్వత్తులకు
కాంతి చిందుటే జీవితం
హేతువు లెంచని భక్తవరులకు
రాతి బొమ్మయే దైవం.

# చిరంజీవి పాట

పాటపై హత్యా ప్రయత్నమా
వెలుగు,
కోటపై తమ సాధిపత్యమా !

శిశిరాల చేష్టలకు
చరమ గీతము పాడు
మత్తకోకిలకేమో మరణదండనమా ।
జనవాణి వినిపించు
రణనాద గళముపై
నిర్జీవ నిశ్చల నీరవ సమాధియా !

దురిత దుశ్శాసన
దుర్మార్గ పీడనల
ఎదిరించు పంచమశ్రుతికి వనవాసమా !
ఆబాలగోపాల
మాదరించే అభయ
గీతికా యజ్ఞానికే అసురభయమా !

అరుణోదయమువైపు
చరణాల నడిపించు
పల్లవుల ఉల్లములపై శిశిరఘాతమా!
త్యాగమే రాగమై
ఆగ్రహావేశమే అక్షర పతాకమై
ఉద్యమించిన బ్రతుకు పై
ఆశనిపాతమా !

# పాలేరు పాట

నాగేటి బాలులో
నడిచేటి కూలన్న
కాలమే నీ వెంట
కదలి వస్తుందిరా!

నీ పాదముద్రల్లో
నీలాలు మొలిచెరా
నీ చెమటలో తడిసి
నేల పులకించెరా!

దున్నువానిది భూమి
దోపిడిది మరుభూమి
కష్టజీవే స్వామిరా
శ్రమశక్తికి నమామిరా!

నీ కొరకు చట్టాలు
నిర్మింపబడ్డాయి
నీ ప్రగతియే దేశ
నిర్మాణ పథమురా! -

పాలేరు పంచకే రాలేని శ్రీలక్ష్మి
పేదొళ్లపై ప్రేమలేనట్టి భూలక్ష్మి
నీ ఇంట నిత్యముగ
నిలిచిపోవాలిరా
నీ కంటి పాపలై
వెలుగ రావాలిరా!

# వన్యమృగరక్షణ

శ్రీశైల భ్రమరాంబికా
రక్షించు
నీ శక్తి బెబ్బులి నిక -

నల్లమల కొండల నడిబొడ్డుపై నిలిచి
తరగెత్తు కృష్ణను ఉత్తర వహినిగా మలచి
రాజీవు గాంధి పులి రక్షా పథకముతో
రక్షించు నీ శక్తి బెబ్బులి నిక

పెద్దపులి రక్షణయె
వన్యమృగ రక్షణము
వన్యమృగ రక్షణయె
వన్యజన రక్షణము
వన్యజన రక్షణే వన రక్షణము గదా!
వన రక్షే జీవ్యావరణ రక్షణ గదా!
జీవ్యావరణ రక్ష జగతి రక్షణ సదా!

మౌర్య చక్రవర్తి, జైన మతము చేకొన్నట్టి
నాగార్జునుడు బౌద్ధమున సిద్ధి గన్నట్టి
పుణ్య క్షేత్రము ఇచ్చట
పులిశక్తిని పెంచుమా
భారత ప్రజలందరి
సౌభాగ్యమ్ము పెంచుమా!

# వాసంత విలాసం

చెట్ల విక్రమావేశం చూచి
శిశిరం పారిపోయింది
మత్తకోకిలల పాటల తేలి
మధుమాసం దరిచేరింది -

మండుటెండలను ఎదిరించింది
మధువులూరిన మాకందం
చైత్రోదయము అలరించింది
సిరిసిరినవ్వుల సుమగంధం -

బయలుదేరినది వినోదయాత్రకు
బాలబాలికల ఆనందం
పులకరించినది పలకరించినది
పుస్తకపాణి డెందం -

నుదుటి మీద నవశతాబ్దితిలకం
సహస్రాబ్దిహారం మెడలోన
కాలం ఈ భూగోళం మీదికి
కంప్యూటరు సుందరియై వచ్చెను.

ఊరూరా ఊరించే పచ్చడి
ఉగాది తల్లి చేసింది
వేదికలెక్కిన నవపంచాంగం
విజ్ఞానం వెదజల్లింది.

జె. బాపురెడ్డి

# ప్రేమ శక్తి

దీవించండి! దీవించండీ
భావి పౌరులను, పిల్లలను
ప్రేమించండి! ప్రేమించండీ
పేదసాదలను, పల్లెలను -

లాలన చేసిన లేత మొక్కలే
మేటి తోటలై వెలుగును గా।
స్వార్థం లేని త్యాగశక్తియే
ప్రజాస్వామ్యమై వెలయుగదా!

దీక్షతోడ పూజించిన శిలలే
దివ్యశక్తులను పొందుగదా!
వ్యాజము లేని వలపు తలపులే
తాజమహల్‌గా నిలిచెగదా!

నిష్ఠ తోడ ఉలి చెక్కిన శిలలే
నిస్తుల సుందరశిల్పాలు
సత్యాన్వేషక కవి స్వప్నాలే
నిత్యానందక కావ్యాలు -

మనిషి మనిషిపై పెంచిన మమతలు
మానవత్వపు విజయాలు
యోగమైనను ప్రయోగమైనను
ఒకే సత్యోన్ముఖ మార్గాలు

# హిమాలయ గర్జన

మన దేశపు హద్దులోకి
మన శత్రువు రాలేడు
వచ్చాడా చచ్చాడే
బ్రతికి బయటపడలేడు -

అని గర్జించెను హిమాలయం
విని, కంపించెను విషవలయం
నీతి నియంత్రణ రేఖ పయిన్
దుర్నీతి అరాతుల నీడపడెన్
కళకళలాడే కార్గిల్ పై
ముష్కర కిరాతకుల చూపు పడెన్

విశ్వంభర సుందరవదనంలో
విరబూచిన హాసం కాశ్మీరం
క్షణకాలం వెలవెలబోయింది.
నిర్ఘాంతంతో నిట్టూర్చింది -

ఆకాశమునంటు హిమాలయమున్
చిట్టెలుకలు ముట్టడి చేయుటయా!
రసాతలమంటే లోయల్లో
గుంటనక్కల గుటగుటలా!
శూరవీర రణయోధుల ముందట
పెంట కుక్కల భవుబౌలా!
మంచుపూలు శోభించు సీమలో
చీడ పురుగుల చిటచిటలా!
అని ఘోషించెను విను వీధుల్లో

విష్ణు చక్రముల విహంగముల్
నేల మీద నిర్నిద్ర భద్రతా
రుద్రశంఖముల ఫిరంగముల్

వెండికొండపై "వైష్ణవి" కోయిల
కోహం! కోహం! అని పాడెన్
త్వమేవాహమని, త్వమేవాహమని
కన్యాకుమారి నడయాడెన్
అంబ! మదంబా యని భారతిని
అంబాలా కీర్తించెన్

అగర్తలా ప్రేమాంతరంగమున
ఆ అనుభూతే నినదించెన్
సమగ్ర ఉదగ్ర భారత జాతి
శతపత్రం లా రూపించెన్
స్పర్థలు మాని సమస్యలన్నీ దేశభక్తియై దీపించెన్.

పవిత్రమౌ 'పులికొండ'కురక్తం
పులిమిన విద్రోహులపై అగ్నుల్
కురిపించినవి బఫోరు శతఘ్నుల్ -
చిటపట చిటపట చీడలు కాలెన్
కిటకిటలాడిన పీడలు కూలెన్-
నక్కలు, కుక్కలు, రక్కసి మూకలు
ముక్కు మొగము లేకుండా పోయెన్ -

చీకటి దొంగమూక రగిల్చిన
సత్యధర్మశాంతుల పరితాపం
తీర్చెను, జగతి అపోహలు మార్చెను
భారత సేనల శక్తి ప్రతాపం -

పిటపిటలాడిన శత్రు పటాలం
అటు ఇటు దూకెను దిక్కుతోచక
లోకమెల్ల ఛీఛీయని తెగడగ
తోకముడుచుకొనె ప్రాక్ ప్రగల్భం

అమరవీరుల ఆత్మత్యాగం
అమృతపునీత పతాకములయ్యెన్
విజయశిఖరముల మకుటములయ్యెన్.

*(1999 కార్గిల్ విజయహేల)*

# దీక్షాంజలి

నమో నమో దేశమాత
నమో భరతమాత!
నమో ధర్మగుణ పునీత
నమో భాగ్యదాతా!

కళలు ముడిచినావు నీ
కాశ్మీరపు కొప్పులో
సిరులు పంచుతావు నీ
వరగంగా కరముతో -

ఆరు ఋతువులను నీ
చేలాంచలాల లాలించుచు
పైరు పచ్చలే ఎల్లెడ
పరచిన పావన చరితా! -

ఆదమరచి ముప్పొద్దులు
అలల బాలలాడుకొనే
కడలి అద్దమందు సృజన కలలెన్నో కంటావు
గాలి ఈలలందు విజయ గర్జనలను వింటావు -

శ్రీహరి కోటీమో, నీ శివశక్తి విలాసం
అంతరిక్షమంతా నీ
అభ్యున్నతి సందేశం
ఆత్మగౌరవావేశం
అతుల దేశభక్తి యే
అక్షర రక్షణ నీకు
నీ చల్లని దీవెనలే
నిరుపమ విజయాలు మాకు -

# దేశమాత

ఉజ్వల సంస్కృతి విరిసిన
ఓ భారత దేశమా!
విశ్వంభర మోము మీద
వెలిగే దరహాసమా!

తరతరాల చరిత్రను కిరీటముగ పెట్టుకొని
నవయుగ చేతనమునే కేతనముగ పట్టుకొని
కాలానికి బెదిరిపోని కలలకోట కట్టుకొని
శతకోటి ప్రజాజీవన ప్రగతిని నడిపించేటి
ప్రజాస్వామ్యభారతీ!

గాలికేమో నీవు, వీర గంధం దట్టించావు
మట్టికే మో దేశరక్ష మంత్రం బోధించావు
గులాబీల తోటలకు ఘోరాటవి బాటలకు
కంటకాల నెదిరించే కళ నేర్పావు
కారు చిచ్చులను ఆర్పే కౌశలమిడినావు!

చెట్టు చేమ గట్టు, పుట్ట
చరచరాలన్నీ
గనులు, పనులు, ఫ్యాక్టరీలు
పంట పొలాలన్నీ
డేగలనే కాదు, కందిరీగలనైనా సరే
వాలనీవు నీ పచ్చని ఇంటి మీద, ఒంటి మీద
దూరనీవు నీ పవిత్ర వాటిక పై, వాకిటి పై -

# విలువలు

మనిషిని ప్రేమించలేని
మతమెందుకురా!
పయనానికి పనికిరాని
పథమెందుకు రా!

ప్రతిభకు "పట్టం" కట్టని
పాండిత్యం ఎందుకు?
ఆకలి కన్నం పెట్టని
ఐశ్వర్యాలెందుకు?

పసిపిల్లలలో దేవుని
ప్రతిరూపం చూడలేని
కళ్ళు కళ్ళు కావు, గులక
రాళ్లని భావించరా -

ఉపకారికి అపకారం
విపరీతంగా చేసే
కుటిలాత్ములకన్న, వెర్రి
కుక్కలు వెయిరెట్లు మిన్న -

కుచేలురు, కుబేరులు
త్వామేవాహమని నమ్మెచు
కలిమిలేములకు మధ్య
చెలిమిపెంచి మనినపుడే
అసలు సిసలు అద్వైతం
అఖిలావని పునీతం.

# శాంతి విలాసం

అందాల తల్లి
ఆనందాల వల్లి !
ఎక్కడుంది శాంతి
ఏమంది శాంతి !

మనిషి మనసున ఉంది
మన బ్రతుకులో ఊది
బుద్ధ భగవానుని
బోధనలలో ఉంది
గాంధీ మహాత్ముని
సాధనలలో ఉంది

జాతిమత భేదాలు, స్వార్థాల కుట్రంది
దేశాలు వేరైన ధ్యేయమొకటేనంది
యుద్ధాలు మానవుని ఉన్మాదమే అంది
ఈసులేని చోట వాసముంటానంది
స్వేచ్ఛా సమాజమే తన శక్తి అంది -

సత్యాల తోటలో సౌరభం శాంతి
నీతి దుర్గం మీద కేతనం శాంతి
త్రికరణాల పవిత్ర సంగమమె శాంతి -

మైత్రియే తన తీయ మాతృ భాషంది
ప్రేమయే తన మతపు పేరు ఊరంది
తన విజయమే మానవత విజయ మంది.

# అందం - ఆనందం

అందాలు ఎక్కడున్నా ఆరాధించు
అందినా అందుకున్న ఆనందించు -

ఎక్కడో చికట్లో
చిక్క బిక్కు బిక్కు మనే
చక్కని చుక్కల పట్ల
సానుభూతి పెంచుకో! -

అడవుల్లో, కొండల్లో
ఆదమరచి తిరుగాడే
చిన్నారి సెలయేర్లను చేరదీసి పొంగిపోవు
మహానదుల మమకారం
మనసు నిండ నింపుకో !!

తెలవారగానే లేచి
తొలి సంజను దర్శించి
పరవశించి పాడుకొనే
పక్షుల శోభాదిదృక్ష
నిత్యజీవితంలోన నీ కళ్లకు నేర్పుకో ! -

గాలి వానలకు వెరువని
గడ్డిపోచ గర్వంలో
శ్రమజీవుల ఒంట మొలుచు
చెమట బిందువుల లోన
నీతి నిజాయితీల త్యాగ నిరతిలోన వర్థిల్లే
నిస్తుల సౌందర్యాన్ని నిరతము పూజించుకో.

# కనకమహాలక్ష్మీ

పాలు తేనె తెచ్చాం
భక్తితోడ వచ్చాం
మాటలలో చెప్పరాని
మౌనముగాని తెచ్చాం -

నిన్ను నమ్ముకున్నాం
నిర్భయంగా ఉన్నాం
పెడదారిని పోకుండా
నడిపించుముతల్లీ
సుఖసంపద్వల్లీ !

నిక్కమైన నీ మహిమలు
లెక్కకు మిక్కిలిమాతా।
మార్గశీర్షమే నీకు
మధుమాసము మాతా।

బురుజు పేట నీ పీఠం
హిమగిరి నీ కిరీటం
నిరుపేదలు నిర్బలులు
నిఖిలలోక వాసులూ
నీకంటి పాపలు -

ఏ పేరున పిలిచినా
మా పాలిటి శక్తివే !
కలలోనూ నిజమైన
కనకమహాలక్ష్మివే !
కన్నతల్లి లక్ష్మివే !

# మట్టి - మబ్బు

మబ్బులకు మట్టిపై ప్రేమ
మనసుంటే గమనించలేమా !

వచ్చిపోవును మబ్బు వానయై వాగులై
వచ్చు, మోసుక తెచ్చు వనధి సందేశము
కడలివెచ్చని హృదయకరుణా విశేషము -

ఆవని గొంతుకతడి ఆరిపోయిన వార్త
తెలిసికొని గగనాన తేలివచ్చుచు మబ్బు
తల్లడిలు నేలపై వెల్లువై పారింది -

ఎండలను ఎదిరించి గుండె బలమును పెంచి
ఆవిరులె ఆహారమైనట్టి జలదాలు
సొమ్మసిలు చేలపై చేవయై కురిశాయి -

కరిరాజు రక్షకై పరుగెత్తి వచ్చిన
పరమాత్మునట్లు ఏమరపాటు లేకుండ
మట్టి, చెట్టు, మనిషి మౌనవేదనవిని
మెరుపు ఖడ్గము బూని మేఘుడరుదెంచేను.

మేఘ రాగాల ప్రమేయమేలేకున్న
ఆకాశమంతయు ఎడారియై పోదా
భూమియంతయును
మరుభూమియై పోదా!

# తెలిసికో!

మట్టిలేనిది చెట్టు లేదు
చెట్టు మాత్రం మట్టికాదు
చెట్టుకూ మట్టికీ మధ్య
జీవబంధం తెలిసికో !

నింగిలేక నేలలేదు
నేలమాత్రం నింగికాదు
నింగి నేలలు కలిపి నిలిచే
నిచ్చెనేదో తెలిసికో !

పూవులేక తావిలేదు
తావిమాత్రం పూవుకాదు
పూవు తావులు కూడిపాడే
భావమేదో తెలిసికో !

నిప్పు లేక నీరు లేదు
నీరు మాత్రం నిప్పుకాదు
నీటి కడుపున నిదురపోయే
నిప్పు మర్మం తెలిసికో !

జననముంటే మరణమున్నది
మరణముంటే జననమున్నది
జనన మరణము లేనిదే గతి
జన్మమెందెనో తెలిసికో !

# అద్వైత సత్యసాయి

రాముడాతడే - శ్యాముడాతడే
సత్యతారకాత్మగగన సోముడాతడే
పరంధాముడాతడే!

బాలుడాతడే ప్రజ్ఞాలు డాతడే
పుట్టపర్తి పుణ్యక్షేత్ర పాలుడాతడే
గోపాలుడాతడే!

ధ్యానమాతడే - విజ్ఞాన మాతడే
సకలయోగశాస్త్రసార గానమాతడే
ప్రజ్ఞాన మాతడే!

రధము ఆతడే - పథము ఆతడే
సర్వధర్మ దర్శనాభిమతము ఆతడే
సూనృతము ఆతడే !

సత్యమాతడే - నిత్యమాతడే
మనుజ జీవయాత్రకు
సాహిత్య మాతడే
సౌహిత్యమాతడే !

గతము ఆతడే - ఆగతము ఆతడే
వర్తమాన విశ్వశాంతి - వ్రతము ఆతడే
శాశ్వతము ఆతడే
సత్యసాయి బాబాంకిత
స్వామి అతడే.

# ప్రేమావతారుడు

శ్రీ శేషశాయి సాయీ!
శ్రీ సత్యసాయి సాయి !
ప్రేమావతార సాయి !
భవ భయ విదూర సాయీ !

శ్రీ పుట్టపర్తీశ్వరా
శ్రీ చక్రవర్తీశ్వరా
ఇహ పరానందబృందా
దేహాత్మ సుమమరందా !

కాంతి ప్రశాంతి నిలయా!
కరుణా సముద్ర హృదయా!
సర్వజన హిత బోధకా !
సర్వ సమ్మత సాధకా !

సత్యం శివం సుందరం
నీదు త్రికరణ మందిరం
చిద్గోచర మగోచరం
నీ ప్రణవతత్వ శిఖరం

కాషాయ వసన ధారీ
నీలాకాశ వన విహారీ
ఆనంద బ్రహ్మ తేజా
అద్వైత సత్య భూజా!

విద్య వైద్యారోగ్య కల్పవృక్ష ప్రదాత
భక్త జన బాధా విముక్త శక్తి ప్రదాత
దేశకాలాతీత సుఖ జీవన విధాత
శ్రీ సత్యసాయి బాబా కలియుగ విజేత!

నీ జన్మదిన మహోత్సవ శోభ తిలకించి
నరులు, కిన్నెరులు,
సురవరులు పులకించేరు
విరులు, మత్తెపుసరులు,
అనురాగరసఝరులు
శిరముపై ఉరముపై
నీ అభయకరముపై
చిరునవ్వు లొలుకు
నిను చేరి కురిపించేరు
జయజయన్మంగళ జయనాదములతో
సుందర శివసత్య ప్రేమాభినయముతో.

# చైతన్య సుందరులు

అందరూ చైతన్య
సుందరులు కావాలి
అందరూ ఆనంద
నందనులు కావాలి!

కలిమిలేముల గొడవ
కష్టసుఖముల బెడద
లేనట్టి ప్రజ్ఞాన
గానమై పోవాలి!
వెండి కొండ మహత్వ
* 'దుండిగల్' చేరాలి -

పేరేదియైన, గిరి
ధారినే కొలవాలి
ఊరేదియైన, గిరి
ధారిలోనె మనాలి
దైవమొక టేను, అ
ద్వైతమని నుడవాలి -

శాశ్వతను కొలిచి,
ధవళేశ్వరులు కావాలి
చదువేది చదివినా
సత్యమే వెదకాలి
గీతామృతము గ్రోలి,
పునీతులై పోవాలి.

---

* సుందర చైతన్య ఆశ్రం నెలకొన్న ప్రదేశం.

# దేవుడవైపో

కాంతితోడ నీకళ్లు కడుక్కో !
శాంతి తోడ నీ మోము దిద్దుకో !
ఉషోదయం అయిపోతావు
రసార్ణవం అయిపోతావు

దరహాసం నీ మోవి చేసుకో
దయాగుణం నీ చూపు చేసుకో
ఖాండవ వనమై పోతావు
కల్పవృక్షమై పోతావు -

ప్రేమను నీ పరిభాష చేసుకో
స్నేహము నీ అభిలాష చేసుకో
దేవ దూతవై పోతావు
దేశ నేతవై పోతావు -

త్యాగము నే నీ ధనము చేసుకో
సేవను నీ ఆశయము చేసుకో
కుబేరుడవు అయిపోతావు
మారుతివైపోతావు -

సత్యమునే నీ మతం చేసుకో
సమభావం నీ హితం చేసుకో
దేవుడవై పోతావు
శ్రీరాముడవై పోతావు -

# ప్రకృతి పుస్తకం

ఆపాద మస్తకం
అందాల పుస్తకం
సహజ ప్రకృతిని మించు
సత్యమే లేదు -

వాయువై వీచేటి
వర్షమై కురిసేటి, నదులుగా పారేటి
చేపయై ఈదేటి, పక్షియై పాడేటి
ప్రకృతి శక్తిని మించు ప్రాభవం లేదు -

ఏ తల్లి కన్నదో ఈ ప్రకృతి సుందరిని
ఎందులో తన స్వార్థ మింతైన లేదు
పరులు తన వారను పక్షపాతం లేదు
శత్రువులు, మిత్రులను చర్చయే లేని
ప్రకృతి శోభను మించు పావనత లేదు -

పరిశుద్ధమైనట్టి ప్రకృతి సంపదల
స్వచ్ఛమై విలసిల్లు పర్యా వరణము
కలుషితము చేయుట కలనైన తగదు

గాలిలో నీటిలో, నేలలో, చేలలో
విషపదార్థాలను విడిచేటి దుర్మతులు
సాటి మనిషికి చేయు
చేటు చెప్పగరాదు
ప్రకృతి వికృతమైన
ప్రాణికోటియె లేదు

# ఏసు క్రీస్తు

పసులపాకలో పుట్టిన
శిశివు నీవు !
మరియమ్మ కలల తోట
విరివి నీవు !

బెత్లహేం మట్టిలో
ప్రేమను పండించావు
అన్యాయాల ఎడారుల
అమృతం కురిపించావు,
మనిషి మనిషిగా బ్రతికే మార్గం చూపెట్టావు
కామరూపి సైతానును కనిపెట్టి జయించావు -

చుక్కవోలె ఉదయించి
సూర్యుడవై పోయావు
దేవదూతగా వచ్చి
దేవుడవై పోయావు
పాపులను, పతితులను
పరిశుద్ధులుగా మార్చి
రక్షకునే శిక్షించిన శిలువను పావనము చేసి
సత్యవాణివైనావు - నిత్యదీపమైనావు -

మానవతను మతము చేసి
మనిషిని బైబిలు చేసి
దేశ కాలముల వెలిగే
ఏసుక్రీస్తు వైనావు -

# బాపూజీ!

ఆరిపోవని వెలుగుచిమ్మి
ఆరిపోయిన దీపికా!
వాడిపోవని పూలుపూచి
వీడిపోయిన వల్లికా!

నిన్ను కన్నుల చూడలేదు
నీ వెలుగు చూచితి మహాత్మా!
బ్రతుకు తీవెను గంటి, నీ
నవభావ సుమగంధములు బాపూ!

పోరుబందరులోన నీవు
పుట్టినప్పటినుండి గాంధీ!
పోరు సల్పితివయ్య భారత
పారతంత్ర్యము తీరుదాక!

కేలుసాచి మహోగ్రసేనల
డీలు పడగొట్టిన తపస్వీ!
చేతి కర్రను ఊపియే
జగజ్జేతలను తరిమిన యశస్వీ!

మాధవుడు మహమ్మదుడు ఒకడే
ఈశుడును ఏసుడును ఒకడే
లోకహిత జీవనరుఖరీ
గమ్యాకరమ్మొకటేను అంటివి -

మానవతకై నీవు నాటిన
మహిత సత్యాహింస వాటిక
కులమతత్వపు దానవత్వపు
క్రూరమృగముల పాలబడియెను -

అంతరిక్షం గెల్చినాడు
అణువుడొక్కను చీల్చినాడు
మానవేంద్రుడదేమొ హింసా
మకరి దంష్ట్రల చిక్కినాడు -

స్వార్థమును సత్యముగ చూపి
శాంతి బ్రతుకున దుమ్ము రేపే
నాటకమ్ముల భూటకమ్ముల
వేటలాపుట ఎట్లు బాపూ!

ప్రేమ నాగస్వరము నేడు
ద్వేష సర్పమునకు రుచించదు
ద్వేష ఫణములు ప్రేమనే
దీవించినట్లు నటించి కాటిడు -

సామభేదో పాయములచే
శత్రువుల జయింపవచ్చును
మిత్ర రత్నాలట్లు కులికెడు
శత్రువుల జయియించుటెట్లు?

పాదరసమే మైలపడిపోయే
దినాలివి బ్రతుకుటెట్లు ?
ఎవడు మనుజుడొ, ఎవడు దనుజుడొ
ఎవడు దేవుడొ ఎరుగుటెట్లు !

# దేవుడొక్కడే!

మందిర్‌లోనూ మసీదులోనూ
ఉండే దేవుడు ఒకడేరా
మనుషుల్లోనూ మాకుల్లోనూ
గుండెల్లోనూ బండల్లోనూ
ఉండే దైవము ఒకటేరా!

మందిర్ కూల్చి మసీదు కడితే
మసీదు కూల్చి మందిర్ కడితే
కూల్చేవారూ, కట్టేవారూ
కొల్చేదైవము ఒకటేరా!

రాముడు, బుద్ధుడు, క్రీస్తు మహమ్మద్
పుట్టక పూర్వకం పుట్టెను మనిషి
మనిసికోసమే మహాత్ములందరు
అవతరించినార వనీతలమున
ప్రేమదయా సంక్షిప్త రూపులై
మానవత్వ ఆదర్శమూర్తులై -

పుట్టిన వారి తీరొకటేరా
గిట్టిన వారి దారొకటేరా
అన్ని మతాలకు అన్ని హితాలకు
సృష్టిమూల సత్యం ఒకటేరా
మానవజాతికి జీవం పోసే
మార్తాండుడు ఒకడేరా!

పోషించుము సమభావతత్వము
పోకార్చుము ద్వేషాధిపత్యము;
పరమ పావన పరహితత్వము
ధరణిలో వెలగాలి నిత్యము.

# రవీంద్ర కవీంద్రుడు

"జనగణమన అధినాయక"
జాతీయ గీత కవీ!
దేశ కాలాతీత
దివ్యభావ విశ్వకవీ!

నీ జయజయ రావములే
మా జీవిత శ్రుతలయ్యే
నీ స్వప్నములే పండిన
ఈ స్వేచ్ఛా భారతము
సస్యశ్యామలమయ్యె!

వేదోపనిషద్రసాల
నాదాత్మ పికమవై
కనపడి కనపడని, సత్య
కాంతి వీణ మీటినావు
రసాక్షరానంద పూర్ణ
వసంతాలు నాటినావు -

శీతాచల శిఖరమమై
గీతాంజలి పట్టినావు
నింగి నేలల కలుపు, గాన
గంగాఝురివైనావు -

క్రాంత భారతి రథ
శాంతి కేతనము నీవు
మానవతా ప్రగతి చక్ర
జ్ఞాన చేతనము నీవు

# మార్గదర్శి గురజాడ

దారి తెన్నులు లేని తెలుగు
భారతీ జీవితకళా సం
జీవిగా గురజాడ అప్పా
రాయ! వెలసితివి -

పుట్టగానే పరిమళించిన
పూవువై సాహిత్య సుగతిని
నిత్యనూతన సౌరభమ్ముల
నింపిపోయితివి -

దేశమంటే మట్టియనుకొని
మోసపోయిన భరతజాతికి
దేశమంటే మనుషులని, సం
దేశమిచ్చితివి!

ఆలుబిడ్డల అమ్మకొను సం
ఘమ్మునకు తగు బుద్ధి చెప్పగ
సృష్టి చేసితివయ్య "కన్యా
శుల్క నాటకము" -

ఛాందసముపై గ్రాంథికముపై
సాంఘిక దురాచారములపై
కత్తిగట్టి తెలుంగు జాతికి
ఖ్యాతి గూర్చితివి -



జె. బాపురెడ్డి

వేషభాషలు మార్చి, మోసము
చేసి బ్రతికే స్వార్థపరులు
న్నంత కాలము మరువగలమా
నీ గిరీశమును -

ప్రభువులకు ప్రాణమిత్రుడవై
ప్రజలకే ప్రాణమిచ్చితివి
లక్ష్మికాదని నవ్యవాఙ్మయ
లక్ష్మిగొల్చితివి -

నీవు పుట్టిన రాయవరము
నీవు మెట్టిన విజయనగరము
నీ యశస్సు విధానవే ఎ
న్నేళ్లయిన నిల్చున్ -

ఏడ ఉన్నా తెలుగు ప్రజలీ
నాడు తమ జాతీయకవి, నీ
వేయటంచును దశదిశల ఎ
లెత్తి పాడుదురు -

అఖిల మానవ హృదయ సీమల
ఆవరించిన నీ మహాత్మకు
ఏమి ఇత్తును నీకు నచ్చే
ఈ సరాలు వినా !




# చెట్టు గుట్టు

చెట్టే మనిషికి తోడురా
చెట్టే పుడమికి నీడరా
చెట్టే మట్టికి ప్రాణంరా
చెట్టే గాలికి గానంరా!

చెట్టు పచ్చగా శిరమెత్తినచో
ఎండల గుండెలు అదురునురా
చెట్టు చల్లగా చిరునవ్వినచో
మబ్బుల గుండెలు కరుగునురా!

అడవిని పుట్టెను
ఆదిమానవుడు
అడివినె పుట్టెను
వేద మానవుడు
చెట్టే మనిషికి తోడురా . . .

చెట్టే పూలకు మేడరా
చెట్టే పక్షికి గూడురా
చెట్టే అన్నం పెట్టేది
చెట్టే ఇంటిని నిలబెట్టేది -

చెట్టే ప్రగతికి మెట్టురా
చెట్టే ప్రకృతికి పట్టురా
చెట్టు పెట్టుటే పుణ్యంరా
చెట్టు కొట్టుటే పాపంరా!




# నాదే నాదే భారతదేశం

నాదే నాదే భారతదేశం
నాదే నా దేశం
మోదంలోనూ, ఖేదంలోనూ
నాదే ఈ దేశం -

నా రక్తంలో, నా నాడుల్లో
నాదం నాదేశం
నా కన్నుల్లో, నాడెందంలో
వెలుతురు ఈ దేశం -

కాశ్మీరంలో కలలే పూలై
పరిమళించునది నా దేశం
కడలి కెరటముల క్రాంతి పాటలో
పరవశించునది ఈ దేశం -

గంగాఝరిలో, గోదావరిలో
పొంగే చేతన ఈ దేశం
ఢిల్లీకి పల్లెకు చల్లని నెయ్యం
నెరిపే తల్లే నా దేశం -

సద్గతి వేదం - సమతా నాదం
సంస్కృతియైనది ఈ దేశం
మనిషిని దేవుని ఒకటిగ మలిచే
భూతల స్వర్గం నాదేశం.

# అపోహ

అడిగినా అమ్మకూడ
అన్నం పెట్టదని
అపోహలో పడిపోయి
అడివిదారి పట్టావా!

పుస్తకాల ఉన్నదంత
వాస్తవమే అనుకొని
మస్తకాన్ని పాడుచేసుకొన్నావా!
మనిషిమీద ఆశవదలుకున్నావా!

అడవులను కొండలను
అజ్ఞాతపు లోయలను
నమ్ముకొని లక్ష్యం సాధించేవా
మనిషిని కాదని మనిషిని మార్చేవా!

చెట్ల మీద పూసేటి
జీవన వన పుష్పాలు
బుల్లెట్ల మీద పూయిస్తావా!
శుకపికాలు చిలికేటి
నవ వసంత రాగాలు
తుపాకి నోట పలికించేవా!

ఆలోచనకు చిక్కే
అమృత జీవన ప్రభలు
ఆవేశానికి దక్కేనా!
శాంతి అహింసా సంస్కృతి
సాధించే సంస్కరణం
సంహరణంతో సాధించేవా!

# సమతా సంస్కృతి

భారతదేశం బంగరు భూమి
వీరులు, ధీరులు వెలసిన భూమి -

గంగా యమునా గానంలో
పొంగులెత్తిన రస పిపాసిని
గోదావరిలో కృష్ణానదిలో
మహానది కావేరీ హృదిలో
నాట్యాలాడే నాదోపాసిని -

తూరుపు పడమర కనుమలనుండి
పారావారాలను తిలకించి
శీతాచల శిఖం పై నుండి
సేతువు శోభను గని పులకించి
పరవశించెడి పవిత్ర నేత్రి -

అంబలాను అగర్తలాను
ఆత్మీయతతో అల్లినవల్లి
ఢిల్లికి పల్లె పల్లెకు మధ్య
ఎల్లలు లేని నెయ్యము నెరిపే
చల్లని సమతా సంస్కృతి తల్లి -

దేశభక్తిని త్యాగ శక్తిని
జాతి చేతనంలో పండించి
కుల మతాలకు, పిడివాదాలరు
మానవతా సారం బోధించి
ఆనందించే పరమపావని -

# యశస్వీ రామారావు

రంగులతో ఆడుకొనే రామారావూ!
నీ చేతి వ్రేళ్ళ చివురించును చిత్రాలెన్నెన్నో !

"యస్వీ" నీవు యశస్వివి
చిత్ర శిల్ప తపస్వివి
మాటలలో చేతలలో మమతలూరు మనస్వివి
కన్నతల్లి ఇండియాను మరచిపోని "యాయస్వివి"

ఖండ ఖండములలోని
కళాఖండములు చూచి
"చిత్రశిల్ప జగత్తును" చిత్రించిన వాక్ శిల్పీ!
కుంచెను, కలమును, గళమును
రూప, భావ, మధురిమలో
ముంచిన నవ 'త్రవ్యసాచి'.

ఏకోవకు చెందిననూ
ఎంతటివారైనా, నీ
యంతటి వారైననూ
కళాకారులందరినీ గౌరవించు వినయశీలి
సృజనగుణా వనమాలీ!

"జీన్ ఆర్ప్" వలేనే నీ జీవితమొక చిత్రశాల
ప్రాక్ పశ్చిమముల కలిపే ప్రగతి భావ కావ్యహేల
కలలకు రూపంనిచ్చే
కమనీయ రసాత్మ హేల !
బెన్ నికల్ సన్, రోదా
జామినీ రాయ్, బ్రాక్
ప్రతిభల కీర్తించిన, నీ పావనతకు జేజేలు.

# ప్రకృతి పాఠాలు

ప్రకృతిని చూచి ఎనలేని
పాఠాలు నేర్చుకో
కలవర పెడుతున్న నీ
కలతలన్ని తీర్చుకో!

ఎండల తాను భరించి
నీడ ఇచ్చు చెట్టు
పల్లపు నేలలకు నీరు
వదలివేయు గట్టు
స్వార్థ త్యాగమే బ్రతుకుకు
సార్థకత అంటున్నవి -

కడలి నీరు మోసితెచ్చి
గగన వీధులందు తిరిగి
కుమిలిపోవు మట్టినోట
కురిపించే మబ్బుగములు
ఆకొన్న వారి సేవె అమృత తుల్య మంటున్నవి -

దారి తప్పక, ఎపుడు
సౌర మండలం వీడక
సాగిపోతూ అనుదినం
శ్రమియించే భూగోళం
క్రమశిక్షణయే జగతి ప్రగతి మూలమంటున్నది -

పాటపాడుకొకిలమ్మ
ఆటలాడు మయూరమ్మ
మేలుకొలుపు కుక్కుటమ్మ
మేలు చేయు జాగిలమ్మ
పశుపక్షులు కూడ ధర్మపథము వీడ వంటున్నవి.

# మదర్ థెరెసా

మదర్ థెరెసా
మనకిక లేదు
అయినా ఆమెకు
మరణం లేదు -

నిరుపేదలకు నిర్భాగ్యులకు
పరిచ్యుతులకు, బహిష్కృతులకు
ఆర్తులకూ - అనాథలకూ
తల్లియైనది - తండ్రియైనది
వాస్తవకల్పవల్లియైనది -

పుట్టినదేమో యుగస్లోవియా
మెట్టిన మమతలమట్టి ఇండియా
కట్టిన సేవాదేవాలయమున
కొట్టెను విశ్వప్రేమ ఘంటలు -

కలకత్తాలో కాలు మోపినది
నిరాధారులకు దారి చూపినది
కుష్టురోగులను, కష్టదష్టులను
రోగపీడితుల - రుజా బాధితుల
వికలాంగులను - విధి వంచితులను
ప్రేమామృతమిడి పెంచిన తల్లి
సేవా సదనాన తరించినతల్లి -

భారత రత్న ప్రభా విలసితయై
నోబెల్ బహుమతికే విద్యుతియై

కులమత జాతి వర్గాతీత
మానవతా కళ్యాణ దీపమై
వర్థిల్లిన జయవర్థిని ఆమె
శోభిల్లిన గుణసుందరి ఆమె -

సప్త సూత్ర సందేశరాగమున
సుప్తజీవనుల మేలు కొలిపినది
కోటి కనుల కన్నీటిని తుడిచిన
మేటిమాత
జనకోటి నోట
కన్నీటిపాటగా
మిగిలిపోయినది -

# ఆనందరాగం

మనిషిని మనిషి దోచుకొనే
మారణ సంస్కృతి పోవాలి
మనిషికి మనిషితోడు పడే
మమతల సంస్కృతి రావాలి!

సబలులు అబలుల పీడంచే
స్వార్థపరత్వం తొలగాలి
సుఖదుఃఖాలు పంచుకొనే
సుమనస్తత్వం వెలగాలి -

వేషభాషలు వేరైనా వివేకమే పాటించాలి -
రంగం కార్యం ఏదైనా లింగ వివక్షలు పోవాలి! -

జాతులు రీతులు ఏవైనా
నీతి నిజాయితి తప్పద్దు
కులాలు మతాలు వేరైనా
కలహాలకు తావీయద్దు! -
యుక్తులు శక్తులు ఎట్లున్నా
యుద్ధోన్మాదం పోవాలి
వాదవివాదం ఏదైనా
విద్వేషం విడనాడాలి! -

ముందో వెనుకో కావచ్చు
అందరు వచ్చుట పోవుటకే
జనన మరణముల మధ్య మరి
కష్టలు, కుట్రలు తొలగాలి
అందరు ఆనందంగా బ్రతికే
ఆత్మజ్ఞానం విరియాలి!

# మైత్రి గీతం

ఇండియా అమెరికా
దండి దేశాలు
ప్రజలే పాలకులౌ
స్వతంత్ర దేశాలు -

తూర్పు పడమరలలో
తోయధుల అండ
నాల్గు దిక్కుల కలుపునది ఒకే జండా
ఉభయదేశాలకు పోలికలు నిండా -

ప్రాచీనమొకటి, అర్వాచీన మొకటి
ఇరువురికి ప్రీతి సమీచీన మేను
విడదీయరాని ఉమ్మడి విలువలేను -

తొలిసంజ ఇచ్చోట మలి సంజ అచట
బొమ్మ బొరుసుల బోలు భూ ఖండములివి
కాల చక్రము ద్రిప్పు కాంతి ధారలివి -

అణుశక్తియైన "ఐటి" శక్తియైన
సమసమాజస్థాపనమునకే అంకితం
కావాలనే ప్రగతి భావాలయాలివి -

జాతి మతములకన్న కట్టుబొట్టులకన్న
నీతి నిజాయితి, శాంతి సమతోన్నతి
మిన్నయని నమ్మిన మేటి సంస్కృతులివి
వసుధభావిచరిత్ర వ్రాయు భాషలివి.

# నా కవితల జాడలు

ఏ వీ నా కవితలన్ని
ఏమై పోతున్నాయి ?
కవితలన్ని ప్రకృతిలోన
కళలై పోతున్నాయి -

కొన్నేమో కొమ్మల్లో
కోకిలలై కూస్తున్నవి
కొన్నేమో కొలనుల్లో
క్రొవ్విరులై పూస్తున్నవి -

సెలయేటి నోట కొన్ని
కలగానం చేస్తున్నవి -
కడలి కడుపులోన కొన్ని
కలలై విహరిస్తున్నవి!
నింగి దారులందు కొన్ని
నిజాలు శోధిస్తున్నవి -

భూచరాలుగా కొన్ని
ఖేచరాలుగా కొన్ని
జలచరాలుగా కొన్ని
జగతిని సేవిస్తున్నవి -

కొన్నేమో ప్రకృతి ఇంట
ప్రగతి పాటలౌతున్నవి
కొన్నేమొ మనిషి వెంట
సుగతి బాటలౌతున్నవి -

# అమెరికా బతుకమ్మ పాట!

(తెలంగాణా ప్రాంతంలో నవరాత్రుల ఉత్సవాలలో పూలతో తీర్చిన బతకమ్మల చుట్టూ ఆడుతూ పాడుకునే జానపద గీతాల బాణిలో చేసిన రచన ---)

రామ రామ రామ ఉయ్యాలో
రామ సీతారామ ఉయ్యాలో
బతుకమ్మ బతుకమ్మ ఉయ్యాలో
భాగ్యాల మాతల్లి ఉయ్యాలో

అబ్బురము కొలిపేటి ఉయ్యాలో
అమెరికాలో బతుకు ఉయ్యాలో
తలచుకున్నప్పుడు ఉయ్యాలో
తలదిరిగిపోతుంది ఉయ్యాలో
ఇండియాను విడిచి ఉయ్యాలో
ఇల్లు వాకిలి విడిచి ఉయ్యాలో
తల్లిదండ్రుల విడిచి ఉయ్యాలో
ఆశలెన్నో పెంచి ఉయ్యాలో
అమెరికా వచ్చాము ఉయ్యాలో
వచ్చిరాగానైతె ఉయ్యాలో
ముచ్చట పడ్డాము ఉయ్యాలో
బంగారు దేశమని ఉయ్యాలో
పొంగిపోయి నాము ఉయ్యాలో - రామ రామ ॥

సింగారములు చిందు ఉయ్యాలో
రంగు రంగుల కార్లు ఉయ్యాలో
తిన్నగా నున్నగా ఉయ్యాలో
తీర్చినట్టి రోడ్లు ఉయ్యాలో
తోటలు పేటలు ఉయ్యాలో

ఆటలు పాటలు ఉయ్యాలో
ఎక్కడికి అక్కడ ఉయ్యాలో
ఎనలేని "మా ల్" లు ఉయ్యాలో
చోద్యాలు ఎన్నెన్నో ఉయ్యాలో
చూచి మురిసినాము ఉయ్యాలో - రామ రామ ॥

ఎక్కడ చూచినా ఉయ్యాలో
యంత్రాలు తంత్రాలు ఉయ్యాలో
కంప్యూటరు లేక ఉయ్యాలో
క్షణమైన గడవదు ఉయ్యాలో
క్రెడిట్ కార్డు లేక ఉయ్యాలో
ఏ పనీ నడువదు ఉయ్యాలో
కారు లేకుంటేను ఉయ్యాలో
కడప దాటలేము ఉయ్యాలో
హీటర్లు లేకుంటే ఉయ్యాలో
ఇళ్లు వణికిపోవు ఉయ్యాలో
కూలర్లు లేకుంటే ఉయ్యాలో
కుమిలిపోవుటేను ఉయ్యాలో - రామ రామ ॥

కారులే కారులు ఉయ్యాలో
కనపడరు మనుషులు ఉయ్యాలో
భార్య ఓ కారులో ఉయ్యాలో
భర్త ఓ కారులో ఉయ్యాలో
పనిచేయు చోట్లకు ఉయ్యాలో
పరుగులే పరుగులు ఉయ్యాలో
వారానికో సారి ఉయ్యాలో
వంట చేసుకొని ఉయ్యాలో
పూటకు పూటకు ఉయ్యాలో

మాటికి మాటికి ఉయ్యాలో
వేడి చేసుకుంటు ఉయ్యాలో
వాడుకుంటున్నాము ఉయ్యాలో - రామ రామ ॥

పక్కింటి వారితో ఉయ్యాలో
పలుకరింపులు లేవు ఉయ్యాలో
ఇంటి పనులు చేయ ఉయ్యాలో
వంట మనుషులు లేరు ఉయ్యాలో
పసిపిల్లలను చూడ ఉయ్యాలో
ముసలమ్మలూ లేరు ఉయ్యాలో
బేబీ సిటింగుల్లో ఉయ్యాలో
బెక్కు బెక్కు మనెడి ఉయ్యాలో
చంటి పిల్లల వెతలు ఉయ్యాలో
సర్వేశ్వరుడె ఎరుగు ఉయ్యాలో - రామ రామ ॥

చూడవచ్చినట్టి - ఉయ్యాలో
చుట్టాలు మము చూచి ఉయ్యాలో
ఏమి బానిస బ్రతుకె ఉయ్యాలో
ఏమి సంసారాలె ఉయ్యాలో
షోకులెన్ని ఉన్నా ఉయ్యాలో
సుఖము లేదే మీకు ఉయ్యాలో
అని రాగములు తీస్తే ఉయ్యాలో
విని ఊరుకుంటాము ఉయ్యాలో - రామ రామ ॥

తెలుగు కట్టుబొట్టు - ఉయ్యాలో
తెలుగు మాట - పాట - ఉయ్యాలో
తెలుగు వారి చరిత ఉయ్యాలో
తెలుగు సంస్కృతి కూడ ఉయ్యాలో
మరచిపోతున్నట్టి ఉయ్యాలో

మా పిల్లలందరికి ఉయ్యాలో
మనదేశమంటేనే ఉయ్యాలో
పరదేశమైపోయే ఉయ్యాలో - రామ రామ ॥

గంగిరెద్దులు లేవు ఉయ్యాలో
కడప ముగ్గులు లేవు ఉయ్యాలో
గొబ్బిళ్ళు కనరావు ఉయ్యాలో
కోకిలలు వినరావు ఉయ్యాలో
చెమ్మచెక్కలులేవు ఉయ్యాలో
చిరుత భజనలు లేవు ఉయ్యాలో
బుడుబుక్కలు లేవు ఉయ్యాలో
బుర్రకథలు లేవు ఉయ్యాలో
బతకమ్మలు లేవు ఉయ్యాలో
భాగవతములు లేవు ఉయ్యాలో
తెలుగుదేశ చరిత ఉయ్యాలో
తెలుగు వారి ఘనత ఉయ్యాలో
"ఐ డోంటునో" అయ్యో ఉయ్యాలో
అమెరికా తెలుగులకు ఉయ్యాలో - రామ రామ ॥

నన్నయ్య ఎవరంటే ఉయ్యాలో
నవ్వుకుంటున్నారు ఉయ్యాలో
పోతన్న ఎవరంటే ఉయ్యాలో
చేతులెత్తేస్తారు ఉయ్యాలో
తిక్కన్న పెద్దన్న ఉయ్యాలో
అక్కన్న మాదన్న ఉయ్యాలో
మొల్లమ్మ రుద్రమ్మ ఉయ్యాలో
మగువ మాంచాలమ్మ ఉయ్యాలో
తెలుగు వారన కూడ ఉయ్యాలో
తెలియనే తెలియదట ఉయ్యాలో - రామ రామ ॥

విశ్వనాథ ప్రతిభ ఉయ్యాలో
వేయి పడగలు దాల్చె ఉయ్యాలో
జాషువా కావ్యాలు ఉయ్యాలో
జాతికే జాగృతి ఉయ్యాలో
ప్రణయ సుందర వాణి ఉయ్యాలో
పలికె కృష్ణశాస్త్రి ఉయ్యాలో
విప్లవాత్మక కవిత ఉయ్యాలో
వినిపించే శ్రీశ్రీ ఉయ్యాలో
అపరరుద్ర వీణ ఉయ్యాలో
మ్రోగించె దాశరథి ఉయ్యాలో - రామ రామ ॥

నవ కవులు యువకవులు ఉయ్యాలో
నాట్య చూడామణులు ఉయ్యాలో
చిత్రాలు శిల్పాలు ఉయ్యాలో
లలితకళలెన్నెన్నో ఉయ్యాలో
వెలుగొందు ఈనాడు ఉయ్యాలో
తెలుగు గడ్డ మీద ఉయ్యాలో
అన్నిటిని తలపించు ఉయ్యాలో
ఆటా మహాసభలు ఉయ్యాలో
అట్లాంటాలో నేడు ఉయ్యాలో
ఆడపడచులు కూడి ఉయ్యాలో
పాడుకొని ఆడుకొను ఉయ్యాలో
బతకమ్మ పాట విని ఉయ్యాలో
బాలబాలికంత ఉయ్యాలో
బతికించవలెనండి ఉయ్యాలో
అమెరికాలో కూడా ఉయ్యాలో
ఆంధ్ర సంస్కృతి శోభ ఉయ్యాలో - రామ రామ ॥

*(ఆగస్టాలోని కళామయి డా. శ్రీమతి టి. విరంజివి గారి ప్రేరణతో అప్పటికప్పుడు అల్లిన కవిత).*

# చాచా నెహ్రూ

(నవ భారత నిర్మాత పండిత జవహర్‌లాల్ నెహ్రూ బాలబాలికల ఆదర్శమూర్తి. పిల్లలను ప్రేమించిన మహాపురుషులలో ఆయన అగ్రగణ్యుడు. చాచాజీగా ఆయన భావి తరాల పసివాళ్ళ హృదయాల్లో చైతన్య జ్యోతులు వెలిగిస్తుంటాడనడంలో సందేహం లేదు. అలాగే ఆయన సౌందర్యారాధకుడు. గులాబీలను గుండెకు అద్దుకునేవాడు. పాపలు, గులాబీలు బహుశః పరస్పర ప్రతిబింబా లేమో? నెహ్రూజీ జన్మదినం 14వ నవంబరు అందుకే బాలకోటికి పండుగ రోజయింది. హిమవన్నగ శిఖరం వంటి చాచాజీ, బ్రతుకులోయల్లో వికసించే పసిపాపల ఆలోచనలలో పాలుపంచుకోవటం ఈ గేయ నాటికలోని ఇతివృత్తం. ఇందులో నెహ్రూ, గులాబీలు, బాలబాలికలు పాత్రలుగా వస్తారు.

అదుగో రంగు రంగుల గులాబీలు నెహ్రూ కోసం వెదుకుతూ రంగం మీదికి వచ్చాయి.......)

## గులాబీలు :

ఏడీ ! ఏడీ ! మమ్ముల
ఎద కద్దుకొనే తండ్రి?
ఏడీ! ఏడీ! ఎన్నడు
వాడని నవ్వుల తండ్రి?

శాంతి కాంతి దశదిశల
చల్లే మా నెహ్రూజీ,
ఇలనే స్వర్గము చేసెడి
కలలు కనే చాచాజీ? ॥ ఏడీ ॥

విరి తోటలు మా కోసం
వేయించిన రసరాట్
వన్నె చిన్నె లెన్నో మాకు
ప్రసాదించిన స్వరాట్ ? ॥ ఏడీ ॥




పాప లన్నా పూవు లన్న
పరవశమొందే తపస్వి
ప్రజ లన్నా దేశ మన్న
ప్రాణ మిడే యశస్వి ? ॥ ఏడీ ॥

*(అంతలోనే చెంతలో ఉన్న బాలబాలికలు చాచాజీని వెదకుతూ గులాబీల గుండె గుబాళింపులు విని ఆనందాశ్చర్యాలతో తమ భావ విపంచికను మీటుతారు)*

**బాల బాలికలు :**

ఓహో ఓహో గులాబులారా !
ఓహో ఓహో నెచ్చెలులారా !

పాపలనీ పూవు లనీ
పాడుతుంది మీరేనా?
పదపదమున మా ఎడదల
కదుపుతుంది మీరేనా? ॥ ఓహో ॥

ఏడీ మన చాచాజీ
ఎచటనైన చూశారా?
తను పుట్టిన ఈ శుభదిన
మున పండుగ చేశారా ? ॥ ఓహో ॥

ఏ పట్టున వెదకిన తన
రూపే కనపడ దాయెను
ఎంత పిలిచినా అతని
గొంతే వినపడ దాయెను ! ॥ ఓహో ॥

*(అప్పుడు తమకు సన్నిహితులైన పాపలను చూచి గులాబీలు విరబూచిన ప్రేమ హాసరేఖలతో గంతులు వేస్తాయి. అందరూ కలిసి భారత రత్నాన్ని అన్వేషిస్తూ తమ ఆవేదనా వీణకు శ్రుతి పెడతారు.)*







**బృందగానం :**

కనుపించవా తండ్రి
కనుపించవా !
వినిపించవా తండ్రి
వినిపించవా!

కనుపించవా !
వినిపించవా !
విషమైన అమృతంపు
చషకమై పోవు నీ
ప్రేమ గాన రసమ్ము కురిపించవా! ॥ కను ॥

వినిపించవా !
కనుపించవా!
నింగి నేలల కలుపు
సింగిణుల వంటి నీ
భావ మాలికలు మా కందించవా!

కనిపించవా
వినిపించవా
మాటిమాటికి వెలుగు బాటలో పడగెత్తు
తిమిరనాగుల బెడద తొలగించవా! ॥ కను ॥

*(దువ్వ దవ్వుల నుంచి మంచు తెరలను విదల్చుకొని ఉదితభానుని వోలె జవహరుడు తేలివచ్చి రంగం మీద మూర్తీభవించి నిల్చుని ఉంటాడు. మంగళసూచకమైన సంగీతం వినిపిస్తుంది. ఆనంద పరవశులైన బాలబాలికలు, గులాబీలు ఆత్మగీతం ఆలపిస్తారు.)*

**బృందగానం :**

గులాబీలు - బాలబాలికలు : నీ తలపులలో పూచిన రోజాలం
నీ పలుకుల విరబూచిన బాలలం




గులా : నీవే మా బ్రతుకులలో తావివి
బాల : నీవే మా బ్రతుకులకు భావివి
గులా : మా దరహాస మ్మంతా నీ కోసం
బాల : నీ దరహాస మ్మంతా మా కోసం
గులా : మాపై కోపం వచ్చి పోయావా?
బాల : సురలోకపు బాలల కనబోయావా?
గులా : పుడమి మీద నీవు నేడు పుట్టిన రోజా
బాల : స్వాతంత్ర్యమునకు దుర్గము కట్టిన రోజా
గులా : పలుక వేమి దేశమాత పులకరింప
బాల : కలల కడలినుండి నిజము తొలకరింప

(ధ్యాన సమాధి నుంచి అప్పుడప్పుడే మేల్కొన్న గంభీర వదనంతో చాచాజీ తన నిసర్గ ప్రేమ వాక్కులతో చిరంజీవులను సంబోధిస్తాడు. వాళ్ళపై అనురాగాన్ని కురిపిస్తాడు.)

**చాచాజీ :**

పాపలారా!
పువ్వులారా
పాపమంటని దివ్వెలారా
నా కనులలో కమ్ముకొన్న
చీకటులలో తారలారా!

నన్ను ఎందరు మరచిపోయిన
నన్ను ఎందరు విడిచిపోయిన
మరచిపోవక నన్ను తలచే
మంచి మనసుల అంచలారా! ॥ పాప ॥

కడలి ఒడిలో కరిగిపోతిని
నదుల ఎదలను నిదుర పోతిని
కాల కాళీచరణ ధూళిని
కలసిపోతిని గతమునైతిని ॥ పాప ॥

మీ గళమ్ముల జీవనధ్వని
మేలుకొల్పెను నా సమాధిని
వినుటకై మీ ప్రగతి గీతము
వింతగా నే లేచివచ్చితి ॥ పాప ॥

(చైతన్యోద్దీపితులైన బాలబాలికలు, గులాబీలు తమ కృతజ్ఞతా పూర్వకమైన భావావేశాన్ని వెల్లడిస్తారు)

**బాలబాలికలు : గులాబీలు :**

ప్రేమయే నీ రూపమున మము
పిలిచెనా
అందమే నీ డెందమై మము
కలచెనా!

రాగమే నీ కంఠరవమై
త్యాగమే ని జీవితమ్మై
మాకు సుందర భావిమార్గము
చూపెనా
మా కనులలో తేనె కలలు
లేపెనా?

ఆశలే నీ హాసరుచులై
ఆశయమ్ములు నీ తలపులై
మానవతకే మధు వసంతము
నాటెనా
మనిషి నాడుల అనిమిష శ్రుతి
మీటెనా!

(అపుడు ఆరంద్రార్ద్ర నయనుడైన జవహరుడు అ పసి హృదయాలపై అమృతవాక్ శీకరాలు చల్లుతాడు.)

**చాచాజీ :**

మీరే మీరే ప్రేమభావాలు
మీరేలే శాంతి సౌరభాలు
నే నున్నా లేకున్నా
నా రూపము మీ రూపములో
భద్రముగా నే దాచుకున్నా!

నే అన్నా అనకున్నా
మీ మాటల  మీ పాటల
లో నా భావాలను వినిపిస్తున్నా!

నే కన్నా కనకున్నా
మీ చేతలు మీ రాతలు
నా భావంబరమున ముద్రిస్తున్నా!

(చాచాజీ మనస్సును బాగా ఎరిగిన బాలబాలికలు, గులాబీలు తమ నిర్మలానుభూతులను అతనికి వినిపిస్తారు. దేశ పరిస్థితిని వివరిస్తారు.)

బాలబాలికలు :
శాంతి కోసం సమత కోసం
సకల జనముల సుఖం కోసం
పాటుపడుతున్నట్టె కాని
ఫలితమే కనకుంటిమి!

గులాబీలు :
కుల విభేదం మత వివాదం
స్వార్థ జనిత సమర ప్రమాదం
వదలినా యనుకుంటె, వాటి
కామరూపం కంటిమి.

బాలబాలికలు :
జయ జవాను జయ కిసాను
జయ విజయ క్రాంతి భాను
జాతి జీవన జడత్వముపై
జయము నేటికి పొందలే!

మీ గళమ్ముల జీవనధ్వని
మేలుకొల్పెను నా సమాధిని
వినుటకై మీ ప్రగతి గీతము
వింతగా నే లేచివచ్చితి ॥ పాప ॥

(చైతన్యోద్దీపితులైన బాలబాలికలు, గులాబీలు తమ కృతజ్ఞతా పూర్వకమైన భావావేశాన్ని వెల్లడిస్తారు)

**బాలబాలికలు : గులాబీలు :**

ప్రేమయే నీ రూపమున మము
పిలిచెనా
అందమే నీ డెందమై మము
కలచెనా!

రాగమే నీ కంఠరవమై
త్యాగమే ని జీవితమ్మై
మాకు సుందర భావిమార్గము
చూపెనా
మా కనులలో తేనె కలలు
లేపెనా?

ఆశలే నీ హాసరుచులై
ఆశయమ్ములు నీ తలపులై
మానవతకే మధు వసంతము
నాటెనా
మనిషి నాడుల అనిమిష శ్రుతి
మీటెనా!

(అపుడు ఆరంద్రార్ద్ర నయనుడైన జవహరుడు అ పసి హృదయాలపై అమృతవాక్ శీకరాలు చల్లుతాడు.)

**చాచాజీ :**

మీరే మీరే ప్రేమభావాలు
మీరేలే శాంతి సౌరభాలు
నే నున్నా లేకున్నా
నా రూపము మీ రూపములో
భద్రముగా నే దాచుకున్నా!

నే అన్నా అనకున్నా
మీ మాటల  మీ పాటల
లో నా భావాలను వినిపిస్తున్నా!

నే కన్నా కనకున్నా
మీ చేతలు మీ రాతలు
నా భావంబరమున ముద్రిస్తున్నా!

*(చాచాజీ మనస్సును బాగా ఎరిగిన బాలబాలికలు, గులాబీలు తమ నిర్మలానుభూతులను అతనికి వినిపిస్తారు. దేశ పరిస్థితిని వివరిస్తారు.)*

బాలబాలికలు : శాంతి కోసం సమత కోసం
సకల జనముల సుఖం కోసం
పాటుపడుతున్నట్టె కాని
ఫలితమే కనకుంటిమి!

గులాబీలు : కుల విభేదం మత వివాదం
స్వార్థ జనిత సమర ప్రమాదం
వదలినా యనుకుంటె, వాటి
కామరూపం కంటిమి.

బాలబాలికలు : జయ జవాను జయ కిసాను
జయ విజయ క్రాంతి భాను
జాతి జీవన జడత్వముపై
జయము నేటికి పొందలే!

గులాబీలు : మాల పల్లి మహా ఢిల్లి
ప్రణాలిక పథకా మతల్లి
మార్పు చక్రము ఎంత లాగిన
మాయ లేమి మాయలే !

*(అప్పుడు విచారగ్రస్తుడైన నెహ్రూజీ ప్రగతి పథంలో పొంచి వున్న పాముల గురించి హెచ్చరిస్తాడు.)*

**చాచాజీ :**

ద్వేషమును ఆసవముగా సేవించువారు
స్వార్థమును పరమార్థముగా భావించు వారు
క్రాంతి పథమున పొంచియుండిన పాములు
శాంతి సాగరమున విషాంతర్గాములు
వారి బారినుంచి ఈ వసుధను రక్షించండి
మంచిని హింసించెడి దు ర్మతులను శిక్షించండి ॥ ద్వేష ॥

పారతంత్ర్యమును ఏ
రూపమున నున్న చీల్చండి
కులమత నిర్మిత విభేద
కుడ్యాలను కూల్చండి ॥ ద్వేష ॥

భారత సౌభాగ్య గీతి
హారతిగా పట్టనిచో
నా పుట్టిన దినమున మీ
రే పండుగ చేయకండి ॥ ద్వేష ॥

*(చాచాజీ సందేశాన్ని అందుకొన్న బాలబాలికలు, గులాబీలు, అతని జీవితాదర్శాన్ని స్మరించుకుంటూ ఆశాగీతం ఆలపిస్తారు.)*

బాలబాలికలు : నీవే భరతావని వై
భరతావనియే నీవై
వెలిగే చాచా నెహ్రూ
వెలిగించు యుగయుగాలు

# సాగర సౌధం

(గేయ నృత్య రూపకం)

(వేల వేల వసంతాలుగా కృష్ణవేణి ప్రవహిస్తున్నది. ఎన్నో శతాబ్దాలు ఆమె కింకిణీ క్వాణంలో కరిగిపోయినవి. ఎన్నో సామ్రాజ్యాలు ఆమె పుణ్యతీరంలో వెలిసిపోయినవి. అయినా ఏనాడూ ఎవ్వరూ ఆమెకు ఉండటానికి ఒక ఇల్లైనా కట్టలేదు. నిలువ నీడలేని తాను ఎవరికీ సాయపడలేక పోతున్నానని, తన సంపద అంతా అడవిగాసిన వెన్నెలై పోతున్నదని విలపిస్తుంది. ప్రజల పంచలో ఉండలేకపోతున్నాననే వేదనతో కృష్ణమ్మ కన్నీటి కాలువై కడలి దారిపట్టింది

(స్వాతంత్ర్య కాంతి స్నాతులు, విజ్ఞాన విజేతలు, సాహసోపేతులు అయిన నేటి తెలుగు జనకోటి ఆమెకు మహాసౌధం కట్టడం, ఆమె కన్నీరును పన్నీరుగా మార్చడం ఈ నాటికలోని ఇతివృత్తం. యోగనిద్రా ముద్రనుండి నాగార్జునుడు ఈ సాగర సౌధ నిర్మాణానికి మూర్తం పెట్టి ముగ్గుపోయిస్తాడు.

(కృష్ణవేణి, ప్రజాశక్తి - నలుగురైదుగురు స్త్రీ పురుష మూర్తులు - నాగార్జునుడు ఇందులో పాత్రలుగా వస్తారు. అక్కడక్కడ నేపథ్యకంఠం విలపిస్తుంది.)

(యథోచితమైన రంగంలోకి కృష్ణవేణి ప్రవేశిస్తుంది. ఒక ప్రక్క యోగముద్రలో నాగార్జునుడు, మరొక ప్రక్క మౌనముద్రలో కొందరు ప్రజలు ఉంటారు)

## కృష్ణవేణి :

నిజమేనా ! నిజమేనా!
నేను కన్న కల నిజమేనా!
బాధామయమౌ నా చిరగాధ
పండు వెన్నెలై విరిసేనా?
రాలే నిండిన నా ఒడినిండ
రత్నరాసు లిక కురిసేనా? ॥ నిజమేనా ॥

ఎవరాలించని నా వేదనలు
ఈ నా డందరు విన్నారా?

ఎవ రూహించని నా శక్తులను
ఈనాటి ప్రజలు కన్నారా? ॥ నిజమేనా ॥

(అప్పుడు నేపథ్య కంఠరం వినిపిస్తుంది. తదనుగుణంగా కృష్ణవేణి స్పందిస్తుంది.)

**నేపథ్య కంఠం :**

కన్నీరు తుడుచుకో
కృష్ణవేణీ! నీ
కష్టాలు ఈడేరెనమ్మా !
నిజమేను, నిజముగానే
నీ కలలు పండె
విజయహాసము చిందు మమ్మా!

అడవిపాలైన నీ అందాల బ్రతుకింక
ఆరాధనీయమౌ నమ్మా!
కడలిపాలైన నీ సంసార సంపదలు
కనకంపు కోటలౌ నమ్మా! ॥ కన్నీరు ॥

వినుము, విస్మృత చరిత్రము లేచి
నాగార్జునుని గళమ్మున మ్రోగె నిదిగో!
విను, ప్రజాతంత్ర స్వతంత్రతా కాహళులు
వీర జన కంఠాల నదిగో! ॥ కన్నీరు ॥

(అప్పుడు నాగార్జునుడు యోగనిద్రనుంచి మేల్కొంటూ)

**నాగార్జునుడు :**

ఎవరో నను లేపినారు
ఎడతెగని నిదుర నుండి

విధియే పడద్రోసి చనిన
శిథిలాలను కదిలించి

నా దట్టపు చీకటి గది
లో, దీపము వెలిగించి - ॥ ఎవరో ॥

కలిపి, అమర త్రిశరణార్ద్ర
గానము కృష్ణా గళమున
నిదురపోతి, నే నీ
నిర్నిద్ర బౌద్ధ విహారమున ॥ ఎవరో ॥

ఆనాటి విజయపురిని
ఆనాటి కళాలయమును
విజ్ఞాన ధనులు పున
రావిష్కరించెదరు ఎవరో ॥ ఎవరో ॥

*(నాగార్జునుడు అర్ధనిమీలితనేత్రుడై కూర్చుని ఉంటాడు. ఉదాసీనంగా ఉన్న ప్రజలు చైతన్యవంతులై లేస్తారు.)*

**ప్రజాశక్తి :**

తల్లీ! కృష్ణానదీ మతల్లీ !
తరగని బాధా తరంగ వల్లి !

సుందరదేశ చరిత్ర శుక్తి గర్భమున పుట్టి
పథములేనిదెదో మహా
ప్రస్థానము తలపెట్టిన - తల్లీ ॥

నీ దారిని అడ్డినట్టి
భూ ధరాల చీల్చినావు
కోనల లోయల బడి, కో కోయని మము పిల్చినావు - తల్లీ ॥

సెలయేళ్ళిడినట్టి జలాంజలులు స్వీకరించి నావు
గ్రీష్మాంగన కోపానల
కీలలు భరియించినావు - తల్లీ ॥

అందినంత వరకు జీవ
మందించితి వెందరికో
ఎటు తోచక నీవే పోయితి వే సాగరమునకో - తల్లీ ॥

**కృష్ణవేణి :**

ఆహా! ఎన్నాళ్ళకు, ఈ
అమృతవాణి విననాయెను
అపుడే నా కనులలోని
అశ్రుజలము విడిపోయెను ॥ ఆహా ॥

ఎవరో మీరెవరో నా
ఎద ఎదను కదల్చినారు
ఇంత చల్లగా, నా సుతు
లేనా నను పిల్చినారు ॥ ఆహా ॥

నిలువ నీడ లేని నాకు
విలువ ఏమి, చలువ ఏమి?
చేరదీయ నపు డెవ్వరు
చింతించుట గాక ఏమి? ॥ ఆహా ॥

కష్టాలను నష్టాలను
కవిత లల్లుకొన్నాను
కలల అలలలో తేలుచు
కాలము వెలిబుచ్చినాను ॥ ఆహా ॥

**ప్రజాశక్తి :**

స్వతంత్ర భారత
ప్రభాత కాంతి
చ్ఛటా స్నాతులం శాంతి దూతలం

నేలలు దున్నెడి హాలికులం,
ప్రగతీ లతికా పరిపాలకులం
దారిద్ర్య పిశాచీ రిపులం
సమతా జీవన జ్యోతి శ్శిఖలం ॥ స్వతంత్ర ॥

శ్రమ ఘర్మ జల సముద్రాల
నవ సమాజ నౌకా చోదకులం
త్వదీయ హాస ప్రదీప్తితో
మము దీవించుమనే ప్రజలం ॥ స్వతంత్ర ॥

**కృష్ణవేణి :**

ఎందరెందరో రాజులు
ఎన్నెన్నో సామ్రాజ్యమ్ములు
కాల దేవుని విలయ చితిలో
కాలినవి కాష్టమ్ములై

ఎన్ని ఎన్నో సంస్కృతులు
ఎన్నెన్నియో నాగరికతల్
భిన్నమై విచ్ఛిన్నమై అయి
యున్నవి పురాతన కథల్ ॥ ఎందరెంద ॥

కాని ఎవ్వరు నాకు గృహమును
కట్టుటే తలపెట్టలేదు
వారు సుఖపడలేదు పో నా వలన,
నను సుఖ పెట్టలేదు ॥ ఎందరెంద ॥

కరువు కాటకములను పస్తుల
మరణముల కని ఏడ్చినాను
ఎవరికిని కొరగాని నా బ్రతు
కెటలో ఒక్కటు లీడ్చినాను ॥ ఎందరెంద ॥

**ప్రజాశక్తి :**

అవునమ్మా! అవు నమ్మా!
అన్యాయము జరిగినది
కినియకు, ఆ వెనుకకు
జరిగిన దేదో జరిగినది

బలులు శాతవాహనులు
ఇలాధిపులు ఇక్ష్వాకులు
నీ శక్తి గ్రహించలేక పోయిరో!
ధీ శక్తియే చాల కూరకుండిరో ! ॥ అవు ॥

తర తరాలు తరిగి పోయె
చరిత్ర కడు కరిగి పోయె
నీ చిద్గీతా సంగీతాలలో
నీ పదముద్రా సంకేతాలలో ॥ అవు ॥

రాజులు, రారాజులు
అబ్దాలు శతాబ్దాలు ఏలి
చేయలేని కార్యమ్మును
చేతుము నీ కొరకై
మోయలేని భారమ్ములు
మోతుము మా కొరకై ॥ అవు ॥

**నాగార్జునుడు :**

విన్నాను, విన్నాను విప్లవపు పాట !
వీర ప్రజాకోటి ! వింటి మీ నోట !

వే వే వసంతాలు విర బూయు తోట
రాలే గగుర్చి రత్నాలైన బాట
కృష్ణ వేణమ్మ కోర్కెల పసిడి కోట
నిర్మింపగా మీరు నిలచు టీ పూట - ॥ విన్నాను ॥

చాలు ఈ ఒక మాట శ్రవణ పేయమ్మ
క్షణమె ఈ రోజు అక్షర శతాబ్దమ్మ
నను ఏల మేల్కొల్పిరను సంశయమును
తీర్చె మీ నిర్మాణ దీక్షాశయమ్మ ॥ విన్నాను ॥

**ప్రజాశక్తి :**

అపర బుద్ధావతార !
బౌద్ధ
సంఘారామ స్థల విహారా !

క్షమియించు, కోరి నిను
కదలించి లేపితిమి
వెలుగు పూయని కాల
వృక్షమును ఊపితిమి ! ॥ అపర ॥

ముగ్గు రయ్యలు మెచ్చు మూర్తమ్మ పెట్టుమా
మూల కంభమునకై నేల చూపెట్టుమా
నీకన్న పండితుడు మా కెవ్వ రాచార్య !
వేగ సెలవీయు మో నాగార్జునాచార్య ! ॥ అపర ॥

**నాగార్జునుడు :**

ఈ శుభోదయ వేళ కన్న
ఈ నవోదయ వేళ కన్న
ఏకతా శస్త్రమును మీరు
చేకొనిన ఈ వేళ కన్న
లేదు వేరే మూర్త మన్నది
లేదు వేరే యధార్థ మన్నది
మాతృభారత వాటి పూచిన
ఓ తెలుంగు ప్రజాకోటి !

త్రిశరణాలు ప్రతిధ్వనించెడి
దీన జనతార్తి నినదించెడి

పురములెన్నో వెలుగు చిందిన
మునిగుణమ్ములు ముక్తి పొందిన
నందికొండల లోయలో
అందముల ఈ నేలలో
ముగ్గు నిపుడే పోయ రండి
మూల కంభము నెత్త లెండి -
మీరు కృష్ణకు కట్టదలచిన
మేడపై ఆ కొండ మీద
అసదృశమగు బౌద్ధశిల్ప క
ళాలయమును కట్ట లెండీ !
అదృశ్య నే నహర్నిశలును
అచట వెలసి తరింతునండీ
సెలవు నాకిక, కృష్ణవేణీ
స్వప్న సాగర మౌదునండీ......

(నాగార్జునుడు అదృశ్యుడై పోతాడు. కృష్ణవేణి కనుమరుగై పోతుంది. భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ వేదిక మీద కనిపిస్తాడు.)

## నేపథ్య కంఠం :

అదె స్వతంత్ర విహాయస విహారి జవహరుడు
ఎగసి వచ్చెను ఎత్తెమూల కంభము నదే !

"ఇది మీరు వెలిగించిన దీపం
ఇది కోటికోటి కలలకు రూపం "
అని మ్రోగెనదె ప్రజాగళ శంఖం
విని, పొంగులెత్తే నెహ్రూ అంతరంగం.

(అప్పుడు సాగర సౌధ నిర్మాణ సంరంభంలో ప్రజాశక్తి విజృంభిస్తుంది)

## ప్రజాశక్తి :

రండీ ! రారండి వెలుగు
జండా ఎగరేయండి !

కృష్ణమ్మ ఎద నిండే
ఖిల్లా నిర్మించండి !!

బండ నెత్తుకొని రండి
బంగార మదే నండి?
సుత్తెలు ప్రయోగించండి
సుర దుందుభు లెందుకండి ! ॥ రండీ ॥
యంత్రాలను వాడండి
ఎముకల బిగి చూపండి
హాలా హలముల నుండే
అమృతములు పిండండీ ! ॥ రండీ ॥

పాతాళ మ్మంటు దాక
పునాదులను త్రవ్వండి !
ఆకావము నంటుదాకా
ప్రాకారము కట్టండి ! ॥ రండీ ॥

కంటకాల నెట్టి పొల
కాలువలను పెట్టండి !
సాగరాల కొట్టి జీవ
సాగరాలు కట్టండి ! ॥ రండీ ॥

(కృష్ణవేణీ తిరిగి రంగంలో ప్రవేశించి సంపూర్ణమైన సాగర సాధాన్ని చూచి)

**కృష్ణవేణి :**

ఆహా! ఆహా! ఎంతటి
అమరపురాలయ మిది!
విద్యా విజ్ఞాన శక్తి
విజయ పురాంగణ మిది!

నే కన్న కలకన్న నేత్ర పర్వ మిది
నేలకును నింగికిని నిండు గర్వ మిది! ॥ ఆహా ॥




ఆ కొండ పై నేమి వైకుంఠమా అది !
ఈ లోయ దరి నేమి కైలాసమా ఇది !　　　　　॥ ఆహా ॥

ఏదీ బౌద్ధ రామము ?
ఏడీ నాగార్జునుడు ?
ఓహో ! ఆ కొండ మీద ఉన్నారా?
కొండ మీద నేమిటి నా గుండెలోనె ఉన్నారే ?　　॥ ఆహా ॥

చిత్ర చిత్రమైన ప్రకృతి
చిత్రాలే దిశల యందు
మయసభ ఏ మాత్రము, ఈ
మహిమా భవనము ముందు .　　　　　　　॥ ఆ హా ॥

**ప్రజాశక్తి :**

నీ ఆశలు, ఆశయములు
నిండిన సాగర మిదే !
రాగ రసానంద సుధా సాగర సౌధ మ్మిదే !

సేవలకై నీ ముంగిట
నావలు నియమించాము
ఆటలకై పాటలకై తోటలు వేయించాము!　　॥ నీ ఆశలు ॥

నీ నవజీవన శోభలు
నీ నవభావన రూపులు
చూడవచ్చినా రదిగో
సుందరతా పిపాసువులు !　　　　　　　॥ నీ ఆశలు ॥

నీ మహిమలు నీ మమతలు
ప్రేమతోడ చిత్రించెడి
కవులు, క్రాంతి కాముకులు
కళాకారు లల్లరుగో !　　　　　　　　॥ నీ ఆశలు ॥




**కృష్ణవేణి :**

ఏ దారి చూచినా కేదారమే!
ఏ మ్రోడు తాకినా పూ మేడయే !

నా చూపు లెటు ప్రాకినా పచ్చులే !
నా అందె లెట మ్రోగినా అందమే ! ॥ ఏ దారి ॥

నా పాట ప్రవహించె నా కాల్వలై !
నా ఆట దీపించెనా కాంతులై ! ॥ ఏ దారి ॥

పల్లెలకు పేటలకు ఢిల్లీ దాకా
నా కీర్తి నా వార్త ప్రాకినదిగా - ॥ ఏదారి ॥

నాగార్జునుని మంత్ర యోగ బలమో?
నా గవేషణ ధర్మ యాగ ఫలమో?
తీరె నా వెత లన్ని
తీరె ఈ దినము
తీరిచెద వీర ప్రజలార !
మీ ఋణము - ॥ ఏ దారి ॥

(అంతట ప్రజావాహిని కృష్ణవేణి చుట్టు తిరుగుతూ బృందగానం చేస్తుంది.)

**బృందగానం :**

జయ జయ సాగర సదనా
జయ విద్యుత్ స్మిత వదనా
జయ ధ్రువతారా రదనా
జయ కృష్ణాంబుద కేతన
జయ తెలుగు ధరా భూషణ
జయ భారత జన పోషణ
జయ దరిద్రతా భీషణ
జయ ప్రజా విజయ ఘోషణ ! ॥ జయ ॥

# పిల్లలమర్రితో ఇంటర్వ్యూ

*(మహబూబ్‌నగరానికి 2 మైళ్ళ దూరంలో ఉన్న మహావృక్షం పిల్లలమర్రి. దాని వయస్సు 450 సంవత్సరాలు. అది ముదిమిలేని అందాలరాణి. సహస్రనిసర్గ సుందరవేణి. కవి ఆ పిల్లలమర్రిని దర్శించినప్పుడు కలిగిన అపూర్వభావానుభూతికి కవితా రూపం ఈ రూపకం.)*

పిల్లల మర్రి : మనుష్యులతో మాట్లాడే కవీ !
మనస్సులతో మాట్లాడేసుకవీ !
నాకు నోరులేదనుకున్నావా ?
నాకు మనస్సు లేదనుకున్నావా ?
అచ్చంగా కవివట నీవు
ముచ్చటగా నాతో మాట్లాడవా ?
నా మౌన వేదనలకు - నివేదనలకు
నీ నవభావనల మైకు
అమర్చి వినిపించవా ?

కవి : పాడుతున్నా యనుకున్నాను
కల కంఠాలు
పలుకుతున్నా యనుకున్నాను
పక్షి కంఠాలు
రాలుతున్నాయనుకున్నాను
ఎండుటాకులు
అంతేగాని
ఇవన్నీ నీ గొంతుక లనుకోలేదు
కొమ్మలలో దాగి ఉన్న
నీ కోరిక లనుకోలేదు
నిజం చెప్పాలంటే నిన్నటి దాక
నీ వింత గొప్పదాని వనుకోలేదు

పిల్లల మర్రీ ! ఒకసారి
నీ చల్లని కథ వినిపిస్తావా!
పచ్చని నీ బ్రతుకు మూట విప్పి
నాలో ఊహల పచ్చలు కురిపిస్తావా !

పిల్లలమర్రి : ఏమని చెప్పను కవీశ్వరా!
నా ఎదలోని వింత బాధ
ఎలా వివరించాలి ఈశ్వరా !
నా శతాబ్దాల విచిత్ర గాథ -

ఈ దేశాన్ని ఇబ్రహింలోధి
ఏలిన కాలంలో
మహాపురుషుడు కబీరుదాసు వెల్గిన
పదిహేనవ శతాబ్ది అంతంలో
పవిత్ర కబీరు పంక్తులు
పాలమూరు వచ్చారు -

పాలమూరు సమీపంలోని
జైనల్లిపూరు గ్రామంలో నాడు
జీత్వా - నాత్వా అనే
బ్రాహ్మణ సోదరులుండేవారు
అపూర్వ భక్తి సంపన్నులైన
ఆ అన్నదమ్ముల ఆతిథ్యానికి
అబ్బురపడ్డ కబీరు పంక్తులు
అయ్యా! మీకు అర్హులైన గురువును
ఎన్నుకోవాలని సలహా ఇచ్చారు.
వెంటనే ఆ సోదరులజంట
మొండిబారి ఎండిపోయిన

ఓ దండిమర్రిని చూపించి
" ఈ చెట్టుకు ప్రాణం పోసిన వాణ్ని
గురువుగా స్వీకరిస్తాం మేం" అన్నారు.

కవి : చిత్రంగా ఉంది వాళ్లు పెట్టిన షరతులు
అయినా ఆ గొడవంతా ఎందుకు
అమ్మా ! నీ కథ చెప్పు
గుట్టు తెలియని, ఊహకందని
నీ పుట్టుపూర్వోత్తరాల ముడివిప్పు -

పిల్లల మర్రి : అదే చెపుతున్నా నయ్యా !
నా ఆత్మకథే ఇదంతా
వినండి - అసలు నా పుట్టకే
వింతల కొక గిలిగింత -
ఆ తర్వాత కొన్నాళ్ళకు
స్వయంగా కబీరుదాసే
జైనల్లిపూర్ రావటం తటస్థించింది
ఆ అపూర్వ సోదరుల
అతిథ్యాన్ని స్వీకరించటం సంభవించింది.
ఎండి బండబారిన మర్రిచెట్టుకు
ఆయన
నిండుప్రాణం పోయటం జరిగింది.
ఆ అమృత ఘడియలోనే కవీ !
నేను ఆవిర్భవించటం జరిగింది -

కవి : అద్భుతం ఆద్భుతం
నీ ఆవిర్భా వోదంతం
వినిపించు ●

పిల్లల మర్రీ ! ఒకసారి
నీ చల్లని కథ వినిపిస్తావా!
పచ్చని నీ బ్రతుకు మూట విప్పి
నాలో ఊహల పచ్చలు కురిపిస్తావా !

పిల్లలమర్రి : ఏమని చెప్పను కవీశ్వరా!
నా ఎదలోని వింత బాధ
ఎలా వివరించాలి ఈశ్వరా !
నా శతాబ్దాల విచిత్ర గాథ-

ఈ దేశాన్ని ఇబ్రహింలోధి
ఏలిన కాలంలో
మహాపురుషుడు కబీరుదాసు వెల్గిన
పదిహేనవ శతాబ్ది అంతంలో
పవిత్ర కబీరు పంక్తులు
పాలమూరు వచ్చారు -

పాలమూరు సమీపంలోని
జైనల్లిపూరు గ్రామంలో నాడు
జీత్వా - నాత్వా అనే
బ్రాహ్మణ సోదరులుండేవారు
అపూర్వ భక్తి సంపన్నులైన
ఆ అన్నదమ్ముల ఆతిథ్యానికి
అబ్బురపడ్డ కబీరు పంక్తులు
అయ్యా! మీకు అర్హులైన గురువును
ఎన్నుకోవాలని సలహా ఇచ్చారు.
వెంటనే ఆ సోదరులజంట
మొండిబారి ఎండిపోయిన

ఓ దండిమఱ్రిని చూపించి
" ఈ చెట్టుకు ప్రాణం పోసిన వాణ్ని
గురువుగా స్వీకరిస్తాం మేం" అన్నారు.

కవి : చిత్రంగా ఉంది వాళ్లు పెట్టిన షరతులు
అయినా ఆ గొడవంతా ఎందుకు
అమ్మా ! నీ కథ చెప్పు
గుట్టు తెలియని, ఊహకందని
నీ పుట్టుపూర్వోత్తరాల ముడివిప్పు -

పిల్లల మఱ్రి : అదే చెప్తున్నా నయ్యా !
నా ఆత్మకథే ఇదంతా
వినండి - అసలు నా పుట్టకే
వింతల కొక గిలిగింత -
ఆ తర్వాత కొన్నాళ్ళకు
స్వయంగా కబీరుదాసే
జైనల్లిపూర్ రావటం తటస్థించింది
ఆ అపూర్వ సోదరుల
అతిథ్యాన్ని స్వీకరించటం సంభవించింది.
ఎండి బండబారిన మఱ్రిచెట్టుకు
ఆయన
నిండుప్రాణం పోయటం జరిగింది.
ఆ అమృత ఘడియలోనే కవీ !
నేను ఆవిర్భవించటం జరిగింది -

కవి : అద్భుతం ఆద్భుతం
నీ ఆవిర్భా వోదంతం
వినిపించు ఆకాశవాణిలా

నీ అమృతగాథ సొంతం.
ఎందుకలా నిట్టూరుస్తున్నావు ?
ఏమిటీ కంటతడి పెడుతున్నావు ?

పిల్లల మర్రి : చచ్చి బ్రతికిన
ఆ మర్రికొమ్మ నొకదాన్ని
పచ్చ పచ్చని నామూల దేహాన్ని
ఇక్కడే. ఈ సెలయేటి ఒడ్డున
చక్కని ఈ కొండచాలు పంచన
నాటి, నాకు ప్రాణం పోశారు
నీళ్లు కాదు
నిర్మల రాగరసామృతం పోసి
నన్ను పెంచి పెద్దచేశారు.

జీత్వా - నాత్వాలు
జైనుల్లాషా - అప్రపుల్లాషాలైనారు
వాళ్ల జీవితం నా కోసం ధారపోశారు
నా ఒడిలో నా నవ్వుల గుడిలోనే
కాలం గడిపి కన్ను మూశారు !
మతంతో ప్రమేయం లేని
మానవతా వాదులు వారు
మనీషులు, మహర్షులు వారు
సమతాభావానికి
సుహృద్భావానికి
సంకేతాలుగా నా అడుగుజాడల్లో
సమాధులై పోయారు -

కవి : ఈ సమాధులు వారివేనా తల్లీ !
ఏం జరిగింది ఆ పై, అనురాగవల్లీ !

నీ గాధ లహరిలో తేలిపోతుంటే
నిజం కలలాగుంది
ప్రేమ తరూ మతల్లీ !

పిల్లల మర్రి : ఎడారిలో ఒయాసిస్సులా
ఎన్నాళ్ళో పడి ఉన్నాను
హబీబ్ మహ్మద్ అనే
అవ్వల్ తాలుఖదారు
నన్ను కొంత ఆదరించి
నా పంచలో బావి త్రవ్వించి
లోకంతో నాకు
సంబంధాన్ని పెంచే
చీకటిలో వెన్నెలలు ప్రసరించే
చక్కని రోడ్డు వేయించాడు!

కవి : నాలుగువందల యాభై సంవత్సరాల నీ వయస్సు
నాలుగు వందల యాభై వసంతాల నీ తపస్సు
మానవ నాగరికతా పరిణామంలో
ధరిత్రి చరిత్రలో
స్వర్ణయుగానికి సంబంధించినది -
గత కాల విశేషాల గురించి
చూడకుండా
చరిత్రకారులు వ్రాసిన చరిత్రల కంటే
కళ్లార చూచిన నీ నోట వినాలని
ఉల్లం కల్లోలినియై ఘోషిస్తున్నది -

పిల్లల మర్రి : ఎప్పుడూ చూస్తున్నవాళ్లకు
ఏదీ మారుతున్న ట్లగుపించదు

అప్పుడప్పుడు వచ్చిపోయే వాళ్లకే
మార్పు రథచక్రాల జాడలగుపిస్తాయి
అందుకే
అడపా దడపా వచ్చిపోయే
విదేశ నిపుణులు
మన దేశం గురించి
ఇచ్చే అభిప్రాయాలకు
ఎంతో విలువ లభిస్తుంది -

శాంతి యాత్రలు - సమర యాత్రలు
జయాపజయాలు చూశాను
కుతుబ్‌షాహీలు పోయి
అసఫ్‌జాహీలు రావటం
గోలకొండ హైదరాబాదు కావటం
పాలమూరు
మహబూబ్‌నగరమై పోవటం
కళ్ళారా చూశాను నేను
స్వార్థంలో పరమార్థం కొంత
పరమార్థంలో స్వార్థం బోలెడంత
చరిత్రను దగ్గరగా చూస్తే
అతుకుల బొంత -
మహాత్ముల ప్రక్కలో మాయావులు
గులాబీల రెక్కల క్రింద కంటకాలు
లోకం
వెలుగు - చీకటి సహకార సంఘం
అయితే, క్రిందు మీద్దై, వెనక ముందై
సమాజం పురోగమిస్తూనే ఉన్నది
అందుకే

నావంటి కానని కానల బ్రతుకులకు
అంతో ఇంతో ఆదరణ లభిస్తున్నది.

కవి : తరువంశ రాణీ! నీకు
తోబుట్టువులున్నారా?
నిన్ను ప్రేమించిన ధీమంతులు
శ్రీమంతులు ఉన్నారా?
నిన్ను అభిమానించే వాళ్ళు
స్తుతించేవాళ్ళు
నీకేమైనా మేలు చేస్తున్నారా?
ఉపదేశాలు, ఉపన్యాసాలే
ఉపకారాలైన ఈ రోజుల్లో
నీకు ఉపయోగకరంగా
ఉండే దేదైనా చేస్తున్నారా?

పిల్లల మర్రి : బుద్ధునికి జ్ఞానోదయం చేసిన
బోధి వృక్షం గయలో
సిద్ధులకు సేదతీర్చే వట వృక్షం
చెన్నపట్నపు బీచిలో
ఉన్నారు నాకంటే ఎంతో పెద్దవారు
ఎన్నటికీ ఆరిపోని చరిత్రకలవారు -
చిన్న దాన్నే అయినప్పటికీ
మన్నించి నన్నెందరో చేరదీయటం,
జిల్లా పరిషదధ్యక్షులు
జిల్లా పరిపాలనాధ్యక్షులు
పురపాలక సంఘాధ్యక్షులు
పూజ్యులు, సుందరతాదిదృక్షులు
వాడిపోతున్న నా బ్రతుకులో

వాసంతం తేవాలనుకోవటం,
మరుగు పడిపోయే నా చరిత్రకు
మళ్ళీ ప్రాణం పోయటం,
నా శతాబ్దాల తపస్సుకు
ఫలమని భావిస్తున్నాను
నా కృతజ్ఞతలు నీ ద్వారా
వాళ్ళ కందిస్తున్నాను -

కవి : ఎలా నీ బ్రతుకులో
వసంతం విరిసిందో
ఎలా నీ భావిలో ఆనందం కురిసిందో
వివరించవా నా గుండె సంకువైపోగా
వినిపించవా నా కర్ణాలు రసార్ణవాలై పోగా!

పి.మ. : నా శాఖలు నరికి
నా జడ లూడబెరికి
నన్ను నిత్యం చిత్ర వధ చేసే
పసివాళ్ళ నుండి - పసుల కాపరుల నుండి
పాపం పుణ్యం తెలియని పశువుల నుండి
నన్ను రక్షిస్తావని
స్త్రీల పాలిటి కల్పతరువు
నా వంటి తరుల పోషించే (మి) స్త్రీ
ప్రభుత్వ పక్షంగా ప్రకటించటం
ప్రమోదం కలిగించింది నాకు ;
ఆమె నా జీవితశాఖ శాఖకు
నవజీవం పోయడానికి
వినోదయాత్రికుల కోసం
నా అభిమానుల వసతి కోసం

నా ముంగిటిలో
శాశ్వత సుందర భవన నిర్మాణానికి
శంఖుస్థాపన చేయటం - నా భాగ్యం -
రంభోర్వశీ విలాసాలు స్ఫురించే
రసజగత్తులు కళ్ళ ముందు ప్రదర్శించే
లంబాడీ జవ్వనుల లాస్యాలు
నా ప్రాంగణంలో దీపాలు కావటం
నా సౌభాగ్యం -

కవి : ఊహిస్తున్నా నిప్పుడు
నీ ఉజ్జ్వల భావిజీవిత సౌధాన్ని
నిరగని తరగని
వింత వింతల నీ కీర్తి భాండాగారాన్ని -
కళా తృష్ణులు
సుందరతా బృందారామకృష్ణులు
విజ్ఞాన శ్రీధరులు
కరుణాంతరంగులు
భావనా రాజ్యాధినేతలు
హసన్ముఖులు, అంతర్ముఖులు
నరులూ - నారాయణులూ
రాగజ్యోతిర్మయులు
రమ్యోమషస్వినులు
నీ వటపత్ర తల్పాంతరాల కన్పిస్తున్నారు
నీ మౌనవచోధారల విన్పిస్తున్నారు
నీ సుందర స్వప్నాలకు
రూపం కల్పిస్తున్నారు -

పి. మ : గాలి కెరటాల ఊయలలో
లీలగా జాలిగా నేను పాడే పాటల్ని
రాలే తూలిపోలే ఎండుటాకుల మీద
రాగరేఖలతో నేను రాసే లేఖల్ని
ప్రజా నాయకులు వినలేరని
పత్రికా రచయితలు చదువలేరని
ప్రకృతి కవీ ! ప్రగతి రవీ!
నిన్ను నా చెంతకు
రా రమ్మని పిలిచాను
కాదు కాదు, నీ లోకన్నుల ముందు
నాకు నేనై వచ్చి నిలిచాను -

కవి : నిన్ను నేను తలచాను
నన్ను నీవు పిలిచావు
మన ఇద్దరి సమ్ముఖంలో
మానవ లోకానికి ఆవిష్కృతమైంది
నీ నవజీవన మహోదయం
నా నవ భావనార్ద్ర హృదయం.

*(రచన : 1970)*




గులాబీలు : ప్రాజెక్టులు ఫ్యాక్టరీలు
ప్రగతి మందిరా లంటివి
శ్రమ జీవులె సమభావులె
సకల దేవతలు అంటివి

బాలబాలికలు : రాల జూచి, మేము కంట
కాల జూచి బెదరమండి
పథ మెంతటి కఠినమైన
ప్రగతి యాత్ర మానమండి

గులాబీలు : ఏ తోటను పూచిన నీ
ఎదయే మా గమ్యమండి
ఏగాడుపు వీచిన నీ
దే గానము విందు మండి

బాలబాలికలు : పచ్చని విప్లవ గీతులు
పాడే పంట చేలలో
ప్రగతికి దీపం పట్టే
పరిశ్రమల నిను చూతుము

గులాబీలు : సూర్య బింబమున చవి
చూతుము నీ మేధస్సును
చంద్ర బింబమున విందుము
చల్లని నీ మనస్సును

గులా - బాల : జై జై చాచా నెహ్రూ
జే జేలు నీకు
నీ పుట్టిన రోజే లే
మా పుట్టిన రోజు!




కృష్ణరాయలు ఎవరో ఉయ్యాలో
త్యాగరాజు ఎవరో ఉయ్యాలో
రామదాసు ఎవరో ఉయ్యాలో
అన్నమయ్య ఎవరో ఉయ్యాలో
అలమేలు మంగెవరో ఉయ్యాలో
అల్లూరి ఎవ్వరో ఉయ్యాలో
ఆంధ్రకేసరి ఎవరో ఉయ్యాలో
కలనైన తలవని ఉయ్యాలో
తెలుగు బిడ్డల చూచి ఉయ్యాలో
తల్లడిల్లే తెలుగు ఉయ్యాలో
తల్లి చిన్నబోయె ఉయ్యాలో - రామ రామ ॥

శాతవాహనులెవరో ఉయ్యాలో
ఇక్ష్వాకులెవ్వరో ఉయ్యాలో
విష్ణుకుండినులెవరో ఉయ్యాలో
చాళుక్యులెవ్వరో ఉయ్యాలో.
కాకతీయులు ఎవరో ఉయ్యాలో
రెడ్డిరాజులెవరో ఉయ్యాలో
బొబ్బిలిపులులెవరో ఉయ్యాలో
తెలుసుకోవాలండి ఉయ్యాలో
తెలుగు తేజము గూర్చి ఉయ్యాలో - రామ రామ ॥

వేమన్న పద్యాలు ఉయ్యాలో
వేద వాక్కులు మనకు ఉయ్యాలో
వీరేశలింగము ఉయ్యాలో
విజ్ఞాన బోధకుడు ఉయ్యాలో
గురజాడ రచనలు ఉయ్యాలో
కరదీపములు మనకు ఉయ్యాలో
రాయప్రోలు చెప్పె ఉయ్యాలో
రమణీయ నవ కవిత ఉయ్యాలో